


LINTAS-LTS. 6-2315 TL.




## ముఖచిత్రం

ఆ.వె. ముద్దులొలుకుపాపముందుకూర్చొనియుండ,
మోద పడెడు బాల మొగము దనరు,
అట్టమీాద బొమ్మ అందర మెప్పించె
వారపత్రికా! జోహారు గొనుమ!

బాపట్ల వెంకట పార్థసారథి (చెరువు)

*　*　*

20—11—81నాటి ఆంధ్రసచిత్రవార పత్రిక ముఖ చిత్రం "చిన్నారి విరినవ్వులు సిరులిచ్చే చిరుదివ్వెలు" నన్ను ఎంతో ఆకట్టుకుంది. పిలుపు కథ చాల బాగుంది. రచయితకు నా అభినందనములు.

బి. జంగమయ్య (సోంపేట)

*　*　*

20—11—81 సంచికకు శ్రీమతి లక్ష్మీ రమణగారు పంపగా వేసిన ముఖ చిత్రం చాలా బాగుంది. ఇంత వరకూ అటువంటి మంచి ముఖ చిత్రంగల పత్రిక చూడలేదు. ఇటువంటివి ప్రచురిస్తే చాల సంతోషం.

కె. జి. కృష్ణ, విజయ (న్యూఢిల్లి)

*　*　*

20—11—81 వతేదీ వార పత్రిక ముఖ చిత్రము ముగ్ధమోముతో,అప్పుడెవిరిసిన గులాబీలలాచూడ ముచ్చటగా ఉండి మా హృదయాలను దోచుకున్నారు.

లక్ష్మి, రమ, మల్లికార్జున,సంజా (గుంతకల్లు)

## కథలు

13—11—81 జయసుధముఖచిత్రం ఎంతో ఆకర్షించింది. కథలన్నీ ఆలోచింపజేసాయి. ముఖ్యంగా "అహంకారంలో ఆత్మాభిమానం"కోరుకొండ సత్యానంద్‌గారి కథ ఎంతో బావుంది.

గనిసెట్టి నాగేశ్వరరావు, కృష్ణ (ఒంగోలు)

*　*　*

"నా సత్యంకథ" పెద్ద కథ చాలా బాగుంది. మానసిక సంఘర్షణను వర్ణించిన తీరు చాలా సహజసిద్ధంగా ఉన్నది రచయితకి మా అభినందనలు.

జి. నానారావు, డా. ఎం. మధుసూధనరావు, వి. అమరేంద్ర, డా. ప్రసాద్, (అచ్చంపేట)

13—11—81 నాటి జయసుధ ముఖ చిత్రంతో వెలువడిన సంచిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. "కుక్కతోక" "అహంకారంలో ఆత్మాభిమానం" కథలు బాగున్నాయి

కడలి రామచంద్రప్రసాద్ (బోడసకుర్రుపాలెం)

*　*　*

పలావురుచి చూస్తూ, ఎంత లాగి కట్టినా నిదానం రాని కుక్క తోకను చూసి, నవ్వి, నవ్వి, గరికిపాటివారి భారత గ్రామీణ యదార్థగాథ"నా సత్యంకథ అయితే, హిందూ దేశంలో తరచు భాగ్యవంతుల బిల్డింగ్‌ల గోడలు దాటి రానివి ఆత్మాభిమానాలు. చాలా ముచ్చటైన కథలు.. నటన్లో కాక, అట్టమీద కూడా నటిస్తున్న జయసుధగారి చిత్రం బావున్నాయి. "జీవితవనంలో కొత్తగాలి" చదివిన ప్రతీవారు వచ్చేవారం కొత్త పత్రిక, కోసం "కోరిక తీరేవేళ" కోసం పైకి చెప్పకపోయినా నేను ఎదురు చూస్తున్నాను.

గొట్టుం చల్లారావు (కాకినాడ)

*　*　*

13—11—81 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ కట్టా రామ్‌బాబు వ్రాసిన 'కుక్కతోక'కథ చాలా సహజంగా ఉంది.

కె. లలిత (మద్రాసు)



నా అభిమాన తార జయసుధ ముఖ చిత్రంతో వెలువడిన 13—11—81 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక కడు రమ్యంగా ఉన్నది కుక్క తోక కథ చాలా బాగుంది "నా సత్యంకథ" ముగింపు బాగుంది

ముల్లేటి చంద్రశేఖర్ (గాజువాక డిపో)

*　*　*

నటి జయసుధ ముఖ చిత్రంతో వెలువడిన 13—11—81నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో బాగుంది "అహంకారంలో ఆత్మాభిమానం" మొదటినుంచి చేదుగా ఉన్నా, ముగింపు మాత్రం లేనట్లు ఉన్నది

జి. గణపతిరావు (గంటి)

*　*　*

13—11—81నాటిజయసుధముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది "కుక్కతోక" చాలా సహజంగా ఉంది సరిగ్గా ఇటువంటి సంఘటనే ఈమధ్య మా వూర్లో జరిగింది పెద్దకథ "నా సత్యంకథ" ముగింపు చాలా బాగుంది

సి గిరాజా శంకర్ (రాయపూర్)

*　*　*

20—11—81 సంచిక ముఖ చిత్రం చాలా వెరైటీగా వుంది వర్థిల్లండి వర్థిల్లండి అనె కథ బాగానే వుంది కాని వాస్తవముగా సమంజసమో కాదో తెలియదుగాని ప్రతి రంగములో చిన్న పెద్ద తారతమ్యం లేకుండా కట్టుబాట్లను పద్ధతులను అతిక్రమించరాదు అధికార దురాగతాలు పనికి రావని చక్కగా చెప్పారు

ఎ. నాగమల్లేశ్వరరావు (మచిలీపట్నం)

*　*　*

20—11—81 మీ (మా)ఆంధ్రసచిత్ర వార పత్రికలో "ప్రేమంటే" కథానికలో స్త్రీ మనసుని బాగా చిత్రించిన రచయిత గారికి అక్షరాంజలి

గుండా సాంబశివరావు (నేలకొండపల్లి)

*　*　*

"చిన్నారి విరినవ్వులు సిరులిచ్చే చిరుదివ్వెలు" ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక నిత్యనూతనంగా కడిగిన ముత్యమల్లె ప్రకాశిస్తూ కనిపించింది ఈవారంఎక్కువ కథలను అందించి పాఠకులను మీరు సంతృప్తి పరచారుడానికి కారణం పిలుపు, యురేకా కథలు అందుకు సాక్ష్యం పిలుపు యురేకా కథలు నన్ను అమితంగా ఆకర్షించాయి

కందిగట్ల ప్రభాకర్ (జనగామ)

*　*　*

ఒకే రకమయిన ముఖ చిత్రాలు చూసి బోర్ అనిపించినమాకు 20—11—81సంచికపై ముఖచిత్రం 'రిలీఫ్'ను కలిగించింది. ఈసంచికలో "ప్రేమంటే???" కథ బావుంది.

విజేంద్రనాథ్ ప్రసాద్ (ఆదోని)

(66 వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాది
సంపాదకుడు
[1938 1972]
శుక్రవారం 18-12-'81
దుర్మతినామ సం. మార్గశిర బ. అష్టమి
**సంపుటము 75 : సంచిక 15**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు 67-60
ఆరు మాసాల చందా రు 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**గాంధీనగరం, విజయవాడ-520 003**


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
నటి అంబిక
(ఫోటో : ఎస్. ఆర్. డిస్ట్రిబ్యూటర్స్)

**కథలు :**

మంజా ... 6
వావ బడింది ... 12
పెళ్ళి చూపులు ... 27
దేవతా వస్త్రాలు ... 52

**సీరియల్ కథలు :**

తార ... 20
జీవితవనంలో కొత్తగాలి ... 44

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు — 4, లోకంపోకడ — 5, ఫాలాక్షుని డైరీ — 10, ధర్మపథం — 17, వారఫలం — 18, ప్రశ్నావళి — 26, సినిమా — 34, బొమ్మల మహాభారతం — 50, హైదరాబాద్ నోట్ బుక్— 62, ఆంధ్రలో అపూర్వ సంఘటన! — 63, డాక్టర్ సలహాలు—64.


## లోకంపోకడ * టీరిమెన్



# మాంజా

భాగవతుల గాయత్రి



అస్తమిస్తున్న సూర్యుని మొహం అవమానంతో కందిపోతోంది దానికి కారణం తన ప్రమేయం లేకుండానే తాను మునిగి పోతూవుంటే సుబ్బిరెడ్డి ఎగరేసిన ఎర్ర గాలి పటం తనని చూసి కుచ్చుతోకను ఝాడించి మరీ వికటంగా నవ్వటమే!

రామశాస్త్రి కళ్ళు అపరాహ్ణపు భానుడిలా రౌద్రంగా వెలిగిపోతున్నాయి అతని చేతిలోని పచ్చపటం చిరిగి హోమంలో మండే అగ్నిలా రెపరెపలాడుతోంది

చెట్టుకొమ్మల చాటునుంచి అరగంట నుండీ వాగ్వివాదాన్ని చూస్తున్న ఎంకన్న మొహం దివాకరుని ఆఖరి చూపులా వెలవెల బోతోంది

"ఛత్తేరికి... ఆడికులమోడ్ని తప్ప యింకెవర్ని పటమెగరేసుకోనియ్యడీ 'సిన్న దొర ... ఈడిపని పట్టాల..."

మెల్లగా చెట్టుదిగి పసువులన్నింటినీ 'హెయ్ హేయ్. డర్ర్ర్ ..' శబ్దాలతో అదిలిస్తూ పెద్దిరెడ్డి పసువుల కొట్టానికి దారితీశాడు ఎంకన్న

* * *

"ఏటాసినవ్?...జల్ది బువ్వతినిపోరాదు ? మల్లి ఆలిస్యమయితే మక్కెలిరగదంతడుగాదు పెద్దదొర?" అల్యూమినియం గిన్నెను ఎంకన్న ముందుకి తోసి కసిరింది సత్తెమ్మ

"ఊఁ.. తింటలేయే..." మూలిగి గిన్నె ముందు కూలబడ్డాడు

"ఏంది కత?" ముఖంలోకి పరికించి చూస్తూ అడిగింది తల్లి

"కత... గిత .. ఏట్నేదుగాని... నాకో పావలుంటిస్తవ ?" అన్నాన్ని కెలుకుతూ తల్లి వైపు చూడకుండా అడిగాడు ఎంకన్న.

"దేనికీ బిడ్డ? 'చారాన?' అయిన మనింటో గనులున్నయ్‌లె. తవ్వి తీసిచ్చేందుకి! . లెయ్. లేచి తలుపేస్కోనెల్లు.." కొంగు దులిపి, కొడవలి తట్ట చంకనేసుకొని చరచర, వెళ్ళిపోయింది.

"నువ్వేడిస్తవ్?... అయ్యిందె...యిచ్చేవోడు... ఛత్తేరికి..." చేతిని దులిపి, విసురుగా అన్నం గిన్నె నోక మూలకి తోసి, తలుపులాగి కొట్టాని కెళ్ళిపోయాడు నిరాశగా

పదేళ్ళు నిండిన ఎంకన్నకు నీడలా వెంటాడే కోరిక ఒక్కటే. గాలిపటం కొనాలి దాన్ని సుబ్బిరెడ్డి గాలిపటం కంటె పైకెగరెయ్యాలి సుబ్బిరెడ్డిని ఓడించాలి... అదే వాడి చిరకాల వాంఛ!

సుబ్బిరెడ్డిదీ ఎంకన్న వయసే... కాని సుబ్బిరెడ్డి పెద్దిరెడ్డి గారాల బిడ్డ! కడగొట్టు పిండె ఎంకన్న.. పెద్దిరెడ్డి పాలికాపు పాపన్న కొడుకు --

పెద్దిరెడ్డి పొలంలో వెట్టి చాకిరి చేస్తుండగ, ఆ మట్టిలోనే పుట్టి పెట్టుకుని కాపురం చేస్తున్న పాముకటి అతణ్ణి వెట్టి చాకిరినించి విముక్తిని చేసింది అప్పట్నుంచీ అతడి భార్య, ఒక్కగానొక్క నలుసు ఎంకన్న 'దొర' దయవల్ల బ్రతికి బట్టకడుతున్నారు. అంచేత, సుబ్బిరెడ్డి సుబ్బిరెడ్డే! ఎంకన్న ఎంకన్నే! ..

సుబ్బిరెడ్డి పటాన్ని మించి మరే గాలి పటం ఎగరదా నాళ్ళో. ఒకవేళ ఎగరాలని ప్రయత్నిస్తే సుబ్బిరెడ్డి పటం దాని పొగ గణచి నేల కూలేలా చేస్తుంది అంతకు ముందు రోజు రామశాస్త్రికి అదే శాస్తి జరిగింది .. నిజానికి ఏ పటం నేల కూలినా అది తనదిగానే అవమాన పడతాడు ఎర్రి ఎంకన్న! రోజుకో పటం నేల కరుస్తూనే వుంది. ఎంకన్నలో ఎట్లయినా సుబ్బిరెడ్డిని ఓడించాలని కోరిక పెరుగుతూనే వుంది

* * *

కోనేటి ప్రక్క వెలసిన దుర్గాలమ్మ సంబరాలొచ్చాయి. అమ్మవారి పండుగకి

ఊరందరికీ సంబరమే. ఇంటింటా తోరణాలు రంగవల్లులతో కళకళలాడుతూ పకపక నవ్వుతున్నట్లుంది పల్లె. ఊరి పెద్దయిన పెద్దిరెడ్డి ఆధ్వర్యంలో జరపబడే సంబరాలు చూడ్డానికి చుట్టుపక్కల పల్లెల్లోని బంధు జనాలతో అతని ఇల్లు కిటకిటలాడుతోంది.

సత్తెమ్మకు నడుమెత్త లేని పని. 'దొర్సాని'కీ అన్ని పనులు చేసిపెట్టి అప్పుడే గొడ్ల పాకట్లో ఎడ్డి వాల్చింది అలసటగా ఆమె

గొడ్లన్నింటిని తోలుకొచ్చి వరసగా గుంజాలకు కటి, వాటిముందు గడ్డిచల్లి ... అక్కడే ఎత్తు దిమ్మమీద వెనుదిరిగి పడుకునివున్న తల్లిని చూశాడు వెంకన్న మెల్లగా అమె చెంతజేరి ఒదిగిపడుకున్నాడు ఆమె కొంగును కప్పుకుంటూ — అలికిడికి ఇటు తిరిగి పక్కలో జేరిన కొడుకుని చూసి ఒక చెయ్యి వాడిపై వేసింది సత్తెమ్మ వాడి వీపుమీద మెల్లగ రాస్తూ —

"ఏం బిడ్డ ... యియ్యాల గింత జల్ది వచ్చినవే ?"

"ఇయ్యాల అమ్మోరు ఊరెగుద్దిగందా... అమ్మోరి పూజకి పాలు గావల్నని జర జల్ది తోలుకొచ్చెయ్యమన్నాడులే దొర..."

"గట్నా ?"

"అమ్మా ... ఇయ్యాలైన నాకు పావలియ్యరాదె ?" గుమస్తూ అడిగాడు.

"ఏందిర వెంకిగ ?... విప్పుడు జూపిన పావలిమ్మని నా ప్రాణాలు తీస్తుంటివి, నాకాడేవి ? అయిన నీ కేటంతక్కర ? జర చెప్పుతె యింట ?" అంది కొంచెం కోపంగా.

"గాలి పతంగు కొంట"

"విట్టా! ... పావలెట్టి గాలపతంగు కొంటడటండి ... ఏమి సోకుర బిడ్డా!" అంది బుగ్గలు నొక్కుకుంటూ.

"ఏం... నే నెగరెయ్యలేనా ?..." ఆకాశంలో ఎగిరేపక్షుల తెల్లని గాలిపటాల్లా కవబడినయో ఏమో, రెండు చేతుల్నీ గాలిలో బిగించి, గుప్పెళ్ళుమూపి, పెదిమలు బిగపట్టి సూటిగా ఆకాశంలోకే చూస్తూ చేతుల్ని ముందుకీ వెనక్కీచేస్తూ అడిగాడు.

"హూం ... విందుకెగరెయ్యలేవు బిడ్డా ! మన రోజులు మంచిగుండి మీ అయ్యేవుంటే ... అట్టాగే విగరేసేవోడివి ...అయినా నాకాడేవన్ని పైసలు ?"

"దొర నడిగియ్యి"

"పావలకోసం, దొరకాడికి బోనా ?"

"గ్గతె దొరసాన్నడుగు ?"

ఆకాశంలో పక్షులు కనుమరుగైపోయాయి చేతులు ముడిచి తలక్రిందపెట్టుకుంటూ అన్నాడు పట్టువదలని విక్రమార్కుళ్ళా —

"ఆమె ఇస్తదా ?" ఆమె సందేహం —

"ఎందుకియ్యదు ? ... ఇంతపని చేస్తుంటిమి ?" అతడి ధీమా.

"మంచిగ మాటలు నేర్సినవీమద్దె ! ఊరకనే జేస్తుంటిమా పని ? నీకూ నాకూ తిండెట్టి సాకట్లే దొర ?"

"అదంత యిడిసిపెట్టు ... జరపోయి అడుగరాదు !"

"పోకిరోడ ... నడు . గట్నే అడిగిస్త" లేచి కొంగుదులిపి భుజాలచుట్టూ కప్పుకొని, కొప్పు సద్దుకొని పెరటి గుమ్మం వైపు నడిచింది

పని తొందరలో వున్న 'దొర్సాని' పిలచిన అర్ధగంటకు ఇవతలికొచ్చి సంగతి విని ... విసుక్కోబోతూ —

"ఏందిరోయ్ ? ఆటలమీదకి మనసుబోతె పన్నెవ్వరు జేస్తరు మల్ల ?" అంది వెంకన్నను దేశించి — చిరునవ్వుతోనే.

"పనంతయ్యిందండి" తల్లిచాటు నుంచే సమాధానమిచ్చాడు

"ఇస్తున్నగదాని, మళ్ళీమళ్ళీ అడగబోకిట్ట.. మల్లెమొగ్గలు కోసి 'చిన్నదొర్సాని'కిచ్చి పోరాదు ?" అంటు పావల తీసిచ్చింది.

పైసలు దొరికిన ఉత్సాహంలో చిన్న పెద్ద చూడకుండా మొగ్గలు తెంపి చిన్న దొరసాని కిచ్చి పరుగుతీసాడు తూనీగలా—

ఊరవతల మైదానంలో కోలాహలంగా వుంది. రంగులరాట్నాలూ, మిఠాయి అంగడులు, తోపుడు బండ్లమీద బొమ్మలు, యివేవీ వాడి నాకర్షించలేదు వాడి కళ్ళు ఆత్రంగా వెతుకుతున్నాయి సాయిబు తాత కోసం.

చెట్టుక్రింద మూగిన పిల్లలగుంపును తోసుకుంటూ పరిచిన గాలిపడగల దగ్గరికి చేరుకున్నాడు వాడి గుండె ఉప్పొంగిపోతోంది, అన్ని పటాలు తన కాళ్ళదగ్గర, 'రా ... రమ్మని' పిలుస్తూవుంటే ... భయంగా ఒక్కసారి జేబు తడిమి చూసుకున్నాడు. వెంచెంచి విత్తి చూసి చూసి ఆఖరికి కొన్నాడొక తెల్ల గాలిపటాన్ని

రాజ్యాల్ని జయించిన రారాజులా ఠీవిగా రెండుచేతులతో విత్తి ఎదురుగా పట్టుకొని గబగబా నడిచాడు యింటికి

గూటిలో అమ్మ దాచిన పాట్లాలవారాల వ్వంటిని కలిపి ముడివేశాడు ఒక కర్రకు దారమంతా చుట్టి —

"ఇన్నాళ్ళ నాకాడ పైసల్లేక ఆడిఆటలు సాగిన్నె ... తానొక్కడే ఊరందరికీ మొనగాడనుకుంటున్నాడు. . ఈ దినంతో ఆడి సాగరణగిపోవాల... నా ముద్దుల పటమా... విగరవే గాలిలో..." అని తనకు తానే ధైర్యం చెప్పుకొని... నేస్తగాళ్ళందర్నీ కూడించుకొని చేరుకున్నాడు బయలు జాగాకు.

అప్పటికే రంగురంగుల కుచ్చు తోకలు కట్టుకున్న సుబ్బిరెడ్డి గాలిపటం ఏ అడ్డూ లేకుండా ఒంటరిగా ఎగురుతోంది గాలిలో.

"సీ యబ్బ... రోజుకో రంగు మారుస్తడు..." మనసులోనే పళ్ళు నూరుతూ, హుషారుగా గురిచూసి వదిలాడు తన పటాన్ని వెంకన్న

సుబ్బిరెడ్డికి అవమానంగా తోచింది. కయ్యానికైన, వియ్యానికైన సమ వుజ్జీ వుండాలి... అలాంటిది తనంతటివాడు కుంం తక్కువోడు, కూలిచేసుకునేవాడితో కలిసి విగరెయ్యడమా?... అని కాస్సేపు చూడనట్టు ఊరుకున్నాడు. దానితో వెంకన్న మరీ రెచ్చిపోయాడు. సుబ్బిరెడ్డి నేస్తగాళ్ళకిది తీరని అవమానంగా తోచింది.

"ఒరే రెడ్డీ... ఊడికి సొగరెక్కువయిందిరా? నీమీదకే పోటీ వస్తున్నడే... కానియ్యి. చూస్తవేంది?" అని విగసన తోశారు. ఇకనేం ఒకదాన్ని తరుముతూ ఒకటి. ఒకదాన్ని తప్పించుకుంటూ వేరొకటి... కాస్సేపేఅలా..

సుబ్బిరెడ్డి పౌరుషం వెన్నుతట్టింది. వెంకన్న దారం పుటుక్కున తెగింది. అంత విత్తునుండి వెంకన్న తెల్ల గాలిపటం రెక్కలు విరిగిన పక్షిలా గిరికీలు కొడుతూ, నింగినుండి నేలకు విరిగింది. వెంకన్న మొహం వివర్ణమయింది. గాభరాగా దాని వెంట పరిగెత్తాడు

సుబ్బిరెడ్డి బృందం గేలిచేస్తూ వెంట పడ్డారు. వెళ్ళనివ్వకుండా చుట్టుముట్టేరు. ఒకడు చొక్కాపట్టి లాగితే, ఒకడు జుట్టు గుంజాడు.

'ఏరా... పొగరణిగిందా?... మా అమ్మని పైసలడక్కొని... నామీదకే పోటీకొస్తవా'' అంటూ రెక్క పట్టుకలాగేడు

వివ్వరికీ జవాబు చెప్పే స్థితిలో లేదు ఎంకన్న

అతని కళ్ళు అడ్డదిడ్డంగ గాలిపటం వెంటే కదులుతున్నాయి. గాలిపటం నేల కూలేలోగా పట్టుకోవాలని అతని ఆరాటం. ఒక్క ఊపులో అందర్నీ విదిల్చి, గాలిపటం వెంట పరిగెత్తేడు వెనకనించి సుబ్బిరెడ్డి తిట్ల వర్షం వినబడుతోంది హోరులా. వెళ్లి వెళ్లి మైదానం ప్రక్క బురద గుంటలో పడింది గాలిపటం. బురదనీటిపై తేలుతున్న దాన్ని వేండుపుల్లతో పదిలంగా లాగాడివతలకి రెండు చేతుల్తో ఎత్తి చూసేడు. బురద కొట్టుకుపోయి, చీలి పీలికలై తన కోరిక లాగే చిన్నాభిన్నమయిపోయింది వీరి ఎంకన్న గాలిపటం! ఏడ్చుకుంటూ గుడిసెకు చేరుకొని తడికెను ఫెడీమని కాలితో ఉక్రోషంగా తన్ని లోపల నేలపై పొర్లుతూ వెక్కి వెక్కి ఏడ్చాడు గుండె పగిలేలా, గుడిసె అదిరేలా ఏడ్చాడు అలా ఇంకెంతసేపు ఏడ్చేవాడో... ఏడవనిస్తే .. కానీ... ఇంతలోకే పెద్దిరెడ్డి పాలికాపు పైడితల్లి వచ్చి వాడిని రెక్క పుచ్చుకు లేపి .. ఒక్క మాటైనా అనకుండ ఒక్క మాటైనా వినకుండా గొరగొర ఈడ్చుకెళ్ళినట్టే ఎంకన్నని లాక్కెళ్ళి పెద్దిరెడ్డి సావిట్లో నిలబెట్టేడు

నడవలో పెద్దిరెడ్డి పెద్ద వాలుకుర్చీలో పెద లంక పొగాకు చుట్ట కాలుస్తూ సావధానంగా వింటున్నాడు సుబ్బిరెడ్డిని ఒక తొడమీద కూర్చోపెట్టుకొని వరండా పొడుగునా పిల్లలు నిలబడి సుబ్బిరెడ్డి చెప్పే చాడీలకు 'ఔనవును' అని వంత పలుకుతున్నారు ఎంకన్న మధ్యలో నిలబెట్టబడే సరికి . అందరూ నిశ్శబ్దంగా ఎంకన్నవైపే చూడసాగేరు.

''ఏంరా మా వీరెడ్డి కొడుకుని తోశావుట ?'' పెద్దిరెడ్డి నింపాదిగా చుట్ట కొసని కొరుకుతూ అడిగాడు

ఎంకన్న భయం భయంగ తలెత్తి చూశాడు వేటాడబోయే సింహంలా క్రూరంగా చూస్తున్నాయి పెద్దిరెడ్డి కళ్ళు.

చటుక్కున తల దించేసుకొని కాలిగోళ్ళు చూడసాగేడు ఎంకన్న.

గోడవార వీరెడ్డి తల్లి వాడి కాలికి నూనె



మర్దనా చేస్తోంది

''మాట్లాడవేంరా మూగిమొద్దులా ... ఆటస్థలంలో పిల్లగాయలందర్నీ తోసి కొట్టి పారిపోయినవంటగదా ?''

ఏమి మాట్లాడాలో తెలియక బుర్ర గోక్కుంటూ ఆలోచిస్తున్నాడు ఎంకన్న–

''నే నెప్పుడు తోసిన్నబ్బా ఈడ్ని ? ... అంత దయిర్యంకూడాన ?...గాలిపతంగు కిందబడతదేమోననే తొందరలో అల్లందర్నీ ఇడిపించుకొందికి కుసింత గింజా కొని పరిగెత్తే ... అప్పుడే పడిండేమో ఈ పోరగాడు...'' అని అనుకుంటూవుంటే...

''నీ కసలు ఒళ్ళు కొవ్వెక్కిపోనాదిరా ... నీ పని పడతనుండు ... ఒరే ఆ కర్రిలగందుకో'' ఒక్క కేక వేశాడు మండువా అదిరేలా. పిల్లలందరూ బిగుసుకుపోయారు ఆతని ఉగ్రరూపం చూసి పైడితల్లి వినయంగ దుడ్డుకర్ర అందించాడు నెమ్మదిగా సుబ్బిరెడ్డిని ఒళ్ళోంచి దించి తన మహాకాయాన్ని కుర్చీలోంచి లేపి రెండడుగులే వేసి అలిసిపోయి, అక్కడినుంచే ఎంకన్న వీపు మీద బొప్పతూ నాలుగంటించాడు – వాడు ఏడుస్తాడేమో, కాళ్లమీద పడతాడేమోనని ఒక్కక్షణం ఎదురు చూసేడు.

ఇంకా ఎంకన్న ఆలోచన తెగలేదు పాపం. అందుకని పెద్దిరెడ్డి ఆశ తీరలేదు మరో రెండంటించేలోగా, గుమ్మం వెనకనుంచి తొంగి తొంగి చూస్తున్న సత్తెమ్మ రివ్వుమని వచ్చి దొర కాళ్ళకి చుట్టుకుపోయింది.

''దొరా ... నీ కాల్మొక్త ... ఈ తప్పు కాయండి...దొర... ఒక్కగానొక్క బిడ్డ ... నంపబోకండి...అమ్మగార్నడిగి ఆడికి పైన లిమ్మడమే తప్పయింది ... ఇంకెప్పుడిట్ట సెయ్యకుండ ఆడి సేతులిరగ్గొడత ... ఇడిసిపెట్టు దొర...''

దొర కాస్త శాంతించేడు.

''ఊఁ... బాగ బుద్ధిచెప్పు పోరగానికి... మళ్ళిట్ల జేసిండంటె పాతరేస్త...ఫోండి...'' ఒక్క విసురుగా కర్రవిసిరి పెద్ద పెద్ద అంగలేస్తూ సర్కస్ పులిలా లోపలికెళ్ళిపోయాడు.

''నడురా... ఇంకజూసేవేంది...''అంటూ ఎంకడ్ని రెక్కపుచ్చుకు లాక్కువచ్చి గుడిశలో తోసి తలుపేసింది.

''ఇయ్యాల నేనడ్డు రాకుంటే చిరేసును దొర... అయినా నీకేంపొయ్యేకాలం ? పెద్ద దొరకొడుకుతో పరాశికమా? ఆఁ...? పావలిస్తే పప్పుండలు కొనుక్కుతింటె కడుపైన నిండుద్ది ఎందుకొచ్చిన దెబ్బలు కాస్తినిరా బిడ్డా ! ..'' వాడిని మందలిస్తూనే దుఃఖం ఆపుకోలేక వెంవలా ఏడ్చింది, వాడిని గుండెలకత్తు కుంటూ ఆ తల్లి ...

వాడికి ఏడుపుపూరాలేదు, వాడి ఆలోచనా తెగలేదు.

''అమ్మా .. నాదెందుకు తెగిపోవాల ?'' అన్నాడు నెమ్మదిగా

''ఎందుకేటూ ఎరిసన్నాసి... సవకబారు దారంపీది ఆదొరదేమో పట్నం మంజా ! తెగక వుంటదా నీ గాలిపటం ?''

''అట్నానా ? 'మంజా' అంటేంటే ? నాకు సెప్పనేలేదు నువ్వు ?'' ఆశ్చర్యంగ అడిగాడు.

''అంటే దారం గట్టిగుండాలని గాజు పెంకులు నూరి పట్టిస్తర్రా . మామూలు దారం దానికి రాసుకుంటె పుటుక్కున తెగతది'' అంది

''ఎంతమాయ ! ఇదంత పెద్దిరెడ్డి గొప్పన్నమాట . ఒక్క సుబ్బిరెడ్డి గొప్పేంలేదిందులో . ఆడబాబు గొప్పోడు ! అద్దిది సంగతి ఇన్నిటనాల్లు ఏంటూ ఈడి గొప్ప ? అనుకొన్నేవాడిని. అదంతా 'మంజా' మగిమన్నమాట ? గొప్పంత మంజాది ! ఆడిచేతిలోని మంజాది ?''

''అమ్మోయ్ నాకూ కొనరాదె మంజ... సాబుటు తాతసడిగి లెచ్చుకుంట'' ఆశగా అడిగేడు ఎంకన్న

''ఓరి పిచ్చినేనోడ! ఇన్నిదెబ్బలు కాసినా నీకింక బుద్ధిరాలేదంట్రా ? ఇంకా ఊసు ఎత్తబోకు వాటమాటె ఒద్దు మళ్ళి గాలిపటం కొన్నవంటె నామొగొడ్డు తెలిసిందా 'రెడ్డయ్య'కి మళ్ళిగన కోపమొచ్చిందంటె నిన్ను నన్ను మెడపట్టి తొలేస్తడు అప్పుడు తిండిలేక సవ్వాల మనిద్దరం.. ఇంటున్నవా ? మప్పితంగ పనిచేస్తే పెద్దయినంక నిన్ను పాలికాపు చేసుకొన్నడంటె నీకు నీ పిల్లగాళ్ళకి కూడ తిండుంటది. కుర్రతనం ఇడిసిపెట్టి కూసింత ఇంగితం నేర్చుకోరా'' అంటూ వాడికి పలువిధాల బోధించింది.

ఎంకన్న 'బోధిసత్వు'డయ్యాడు.

* * *

వీరన్న తల్లిని వేదిస్తున్నాడు గాలిపటం కొనమని. తల్లి విసుక్కుంటోంది పైసలు లేవని.

వీరన్న విడువలేదు తల్లి విసిగి పైస లిచ్చించి ఎరన్న ఎగుర వేశాడు. నాగిరెడ్డి కూలదోశాడు. వీరన్న ఏడ్చుకుంటూ ఇంటి కొచ్చాడు.

కుక్కిమంచంలో చుట్ట కాల్చుకుంటున్న వెంకన్న కొడుకుని చేర బిలిచేడు బెల్లపుండలు కొనిపెట్టేడు. అయినా వాడు ఏడుపు మానలేదు.

''పెద్దోళ్ళతో తగూలాడకూడ' దని బోధించేడు.

వీరన్న 'బోధి సత్వుడు'కాలేదు ! పైగా అతని 'బోధ' విని బుచ్చమ్మ 'కాళి'లా లేచింది. చేస్తున్నపని ఆపి కొంగుదోపుకొని ఇవతలి కొచ్చింది

''ఏందయ్యో ! మహా బాగానేర్పిస్తున్నడవె బుద్ధులు ఎల్లకాలం దొరబాబులే ఎగురేయా లంట ? మరి మనోల పిల్లలకు 'ఆస' వుండదా ? పోరా ... పోయి ఇంకోటి కొనుక్కో. ఏడునెత్తిపెంటలా పిచ్చి లేనోడ ఊరవతల గుట్టవున్నది చూడు... అందిమీదకెక్కి ఎగరెయ్యి మల్ల.

గొప్పోళ్ళ బిడ్డలు కష్టపడి అంతపైకి ఎక్కలేరులే...ఎక్కేటప్పుడు భద్రం ! కాళ్ళు జారకుండ పట్టుకుని ఎక్కిపోయిన వంటె, ఊరందరికంటె పైన ఎగురెయ్యగలవు నీపతంగుని ! పోయి ఇంకోటికొని తెచ్చుకోర వీరన్న ..'' వాడికి బోధించి ఉద్రేకపరిచి పంపింది బుచ్చమ్మ. ఎంకన్న ఆలోచనలో పడ్డాడు పాపం ! ఆఖరికొక నిశ్చయానికొచ్చి

''అన్యాంగతి జెప్పినవే బుచ్చీ...నాగిరెడ్డికి కీళ్ళవాతం కదా—గుట్ట లెక్కలేడు. ఇయ్యాల మనోడు దొరబాబుని ఓడించేత్తాడు తప్పదు'' సంబరంగా కుక్కిమంచంలోంచి లేచి తుండుదులిపి భుజానవేసుకొని గుడిసె బయటికొస్తూ గొణుక్కున్నాడు తనలోతానే.

''మొదట నాబిడ్డ జారిపడకుండ గుట్ట ఎక్కిపోతే అటెనక ఆడే అందరిలోకి పెద్ద రుడై పోతాడు అటెనక ఆడేగుడిలో దేముడై పోతాడు మొదట నా బిడ్డని కండబలం... గుండెబలంతో పెంచాల గుట్ట లెక్కిసొగల దైర్యం గలోడిగ సెయ్యాల. నేనోడినా నాబిడ్డని గెలవాల !''

కృత నిశ్చయంతో చూసిన ఎంకన్నకళ్ళకి ఆకసంలో ఒక తెల గాలిపటం ఏ అడ్డూ లేకుండా గుట్టపై భాగాన స్వేచ్ఛగా ఎగురుతూ కనబడింది.

వింత దాగమొగిలిచా దాన్ని అందుకోలేని 'దొరబిడ్డ' ఉక్రోషంగ ఒక్క కేకవేశాడు ఆ చిన్నపల్లె అదిరేలా

''అగరా. యియ్యాలొక్కరోజుకి అట్ట కానియ్యి రేపు మా అయ్య నడ్డిమీదే సవారి జేసుకొని ఆగుట్ట ఎక్కకపోను నీపొగరేందో అణచకపోను'' నిప్పులుతొక్కిన కోతిలా రంకెలు వేస్తున్నాడు చిన్నదొర

''అట్లనే కానియ్యి దొర .. రేపు నిన్ను మోసుకొనిగుట్టఎక్కుతలె.కాని...నా సేతుల్లో తయారవుతున్న ఈ 'వంజాదారం' సాన గట్టిది ...తెగదు మాబిడ్డ నీ పసెంటో సూత్తాండూనే'' ఎంకన్న నవ్వుకుంటూ పగిలిన సీసాపెంకల్ని కుప్పపెట్టి నూరడం మొదలు పెట్టాడు

'రేపు తొందరగా వస్తాలే' అని అభయ మిచ్చి కుంటుకుంటూ గుట్టచాటుకి చేరు కున్నాడు ముసిలి సూర్యుడు.

## రీసెర్చ్!

ఒకటవ తరగతిలో
ఒకటికి రెండు కలిపితే
మూడని చెప్పారు ! ...
ఆరవ క్లాసులో
ఒకటి 'ప్లస్' రెండు
మూడని బోధపరిచారు ! ...
ఇంటర్మీడియట్ లో
ఒకటి 'ప్లస్' రెండు
ఈజ్ ఈక్వల్ టు
రెండు 'ప్లస్' ఒకటని
విశదీకరించి చెప్పారు ! ...
ముచ్చటైన మూడేళ్ళ డిగ్రీలో
'ఏ' కి 'బి' కలిపితే ఎంతో
'బి' కి 'ఏ' కలిపినా అంతే,
అని సిద్ధాంత పరంగా
బుజువు చేసి మరీ చూపారు !...
ఆ తరవాత —
డిగ్రీ, పూర్తయిన మూడేళ్ళకి
డిగ్రీ 'ప్లస్' పదిహేనేళ్ళ శ్రమ
ఈజ్ ఈక్వల్టు 'నిరుద్యోగం'
అని 'నేను' విరూపించాను !...

— కొరిమిల్లి సూర్య శంకర్

## పెంచిన ప్రేమ !

కలకత్తాకు చెందిన జయనగరులో నిరూపమ్ రాయ్ అనే ఓ ధనికుడు తన భార్య చనిపోయి, ఇద్దరు కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు చేసి, కొడుకును విదేశాలకు పై చదువులకు పంపాక ఏకాకై పోయి, జీవితం మీద విరక్తి చెందిన పరిస్థితిలో వాళ్ళ కులంలో అనాథ పిల్ల మీనాదాస్ అనే ఆమెను చేరదీశాడట ఆ పిల్ల ఆదరణలో అతను పసివాడై పూరట చెందేవాడట. కాలంగడిచి ఆ పిల్ల పెద్దదై అతని వ్యవహారాలన్ని చూసుకుంటూ నిరూపమ్ రాయ్ వ్యాపారాలకు మేనేజరుగా పనిచేస్తున్న ఆకాష్‌నంది అనే 25 ఏళ్ల యువకునితో ప్రేమలో పడ్డదట ఈ విషయం తెలిసినరాయ్ తాను మీనా లేకపోతే బ్రతకలేనని పసిపిల్ల వానివలె ఏడ్చి, ఆనక వారిద్దరికి 1980 సెప్టెంబరు తొమ్మిదోతేదీన పెళ్ళి చేసి, రెండు మామిడి తోటలు, పదిహెక్టేర్ల పంట భూమి — కలకత్తాలో ఓ చక్కని భవనమూ బహుమతిగా ఇచ్చి పంపివేశాడట ఆమె వెళ్ళి పోయాక ఆయన మళ్ళీ తన భార్య చనిపోయిన కొత్త రోజులలో వలె ఓ చీకటి గదిలో కూర్చునేవాడట అలానూ వుండలేక మీనా నా ఇంటి మహాలక్ష్మి, నువ్వు నన్నొదిలివెళ్ళిపోయావు, నాకు తల్లివై బిడ్డవై కూడా నన్ను లాలించి, మురిపించావు నువ్వు లేని ఈ ఇల్లు, ఈ జీవితం నాకు వొద్దు అని ఓ ఉత్తరం రాసి నిద్రమాత్రలు మ్రింగి చనిపోయాడట ఈ విషయం తెలిసి, ఉత్తరం చూసిన మీనా భావురున్నదట ఆకాష్‌నంది జయనగర్ రైల్వేస్టేషన్ వద్ద నిరూపమ్‌రాయ్ పాలరాతి విగ్రహాన్ని ప్రతిష్ఠించాడట.

## పెళ్ళయ్యాకే పిచ్చి !

ఈనాడు స్త్రీలలో పిచ్చివారయిన వారిలో చాలా మంది వివాహమయ్యాకతమ భర్తతరపు బంధుకోటిబాధలు తట్టుకోలేక చిత్తచాంచల్యం ఏర్పడి, అది ధృవపడిన వారేనని ఈ రకం లెక్కలు కట్టిన వారు అభిప్రాయమట. దేశం మొత్తం మీద ఈ రకం మానసిక స్థితులను తట్టుకోలేక పిచ్చిపట్టిన ఆడామగా సంఖ్య ఎంత లేదన్నా ఒకకోటి అట అసలు దేశజనాభాలో కనీసం 20 కోట్ల మందైనా మానసిక ఆందోళనల వల్ల కాస్త మతిభ్రమణం కలిగిన వారుండి వుంటారని న్యూరోసైన్సు అంటూన్నదట. అయితేవీరిలో చాలా మందికి హిస్టీరియా, పిచ్చివంటివాటిగా ఆరోగాలు రూపొందనందువల్ల ఆసుపత్రులకు రానివారు ఎక్కువున్నారని కూడా వారు అభిప్రాయపడ్డారట

## పిల్లలకి ఆస్ప్రిన్ ప్రమాదం !

ఓహియో, మిచిగాన్ విశ్వవిద్యాలయాలకు చెందిన మేధావులంతా చేరి ప్రతిరోగానికి, నొప్పికి ఆస్ప్రిన్ ఇవ్వడం చాలా హానికరమనీ, పిల్లలకసలు ఆస్ప్రిన్ వాడనే వాడరాదనీ వుద్ఘాటించి, ఇదే విషయాన్ని పునరుద్ఘాటించారట. దీనివల్ల పిల్లలకు "రేసిండ్రోమ్" వచ్చే ప్రమాద మున్నదని [ఎవాకుమ్మడిగా వచ్చే సమిష్టి జబ్బులనచ్చేమో] అన్నారట అట్లమ్మ, ఫ్లూజ్వరాల సమయాలలో పిల్లలకు ఆస్ప్రిన్ వేయడం చాలా ప్రమాదకరమని కూడా వారన్నారట. రిసిండ్రోమ్ వల్లవాంతులు ఆరంభమయి, శరీరం వాతం కమ్మ వచ్చునట. పసిపిల్లల తలిదండ్రులు, వైద్యులు కూడా ఈ విషయంలో బహు హెచ్చరికగా వుండాలని కూడా ఈ మేధావులన్నారట

## ఎయిర్ హోస్టెస్‌లకి మేలుచేసిన తీర్పు !

ఎయిర్ హోస్టెసులు అంగడి బొమ్మలు కారాదని సుప్రీంకోర్టు ఉద్ఘాటించిందట. ఎయిర్ హస్టెసులు వివాహమాడరాదనీ, అట్లాడినా గర్భవతులు కారాదని, అయిన ఎడల తమ వుద్యోగము పోతుందనీ ఎయిరిండియా, ఇండియన్ ఎయిర్ లైన్సు వారి నిబంధనలను సుప్రీంకోర్టు త్రోసి రాజన్నదట ఈ నిబందన భారత దేశపు మహిళలకు బహు అవమానమని కూడా సుప్రీంకోర్టు అభిప్రాయ పడ్డదట. ఆ వుద్యోగానికి వచ్చి ఆడవారు సన్నగా, చిన్నగా [వయస్సులో] నాజూగ్గా, గాజుబొమ్మవలె వుండాలి అనే అభిప్రాయం హస్యాస్పదమైనదని అంటూ, స్త్రీలలో కాస్త వయస్సు వచ్చిన వారికి మర్యాద, మన్ననలను గురించి మరింతఅధికంగా తెలుస్తుందని కూడా అన్నదట కోర్టు.

## కొమ్ములున్న మనుషులు !

కొన్ని జంతువులకు వలెమనుష్యులకు కూడా కొమ్ములు పుట్టుతున్నవైనం చైనాకు చెందిన షాంగ్ హై వెనుబుయ్ బావో అనే పత్రిక ప్రకటించిందట. హెబీయే ప్రావిన్సుకు చెందిన జియహో అనే వూరిలో 88 ఏళ్ళ జావోలిమిన్ అనే ఆమెకు తలలో ఇరుప్రక్కలా, వెనుక భాగంలో చిన్న చిన్న బలిష్టమైన కొమ్ములు వున్నాయట ఈమె ఫోటోతోబాటు ఇంకో ముసలతని ఫోటో కూడా ఈ పత్రిక ప్రకటించిందట. అతనికి 26 సెంటిమీటర్ల పొడవున్న కొమ్ములు మొలిచివున్నాయట

## పెరిగిపోతున్న అంధులు !

భూప్రపంచంయావత్తు కలయజూసి, లెక్కలు తేల్చి చూస్తే నాలుగు కోట్ల మంది అంధులున్నారని తేలిందట. రాన్రానూ ఈ అంధుల సంఖ్య పెరిగిపోతూనే వున్నదనీ, ఇలాగే అశ్రద్ధ చేస్తే ఈ సంఖ్య ఈ శతాబ్దమయ్యే సరికి రెట్టింపై కూర్చుంటుందని ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకటించదట.

## రాంగ్ నెంబర్ల వల్ల పాతిక లక్షలు !

దేశంలో రాంగ్ నంబర్లు తిప్పడం ద్వారా భారత ప్రభుత్వ ఆ శాఖకు 25 లక్షలు పోయినేడు ఆదాయం వచ్చిందట. ఒక్కొక్క "కాల్" యాభై పైసలు చొప్పున సుమారు యాభై లక్షల రాంగ్ నంబర్లు ఏటికి నమోదయివుంటాయట. దేశంలో 250 లక్షల టెలిఫోనులున్నాయని, కనుక ఒక్కో ఫోనుకు రెండేసి రాంగ్ నంబర్లు చొప్పన సరాసరి లెక్క కొచ్చినట్టని ఆ శాఖకు చెందిన కేంద్ర మంత్రి మిస్టర్ స్టీఫెన్ అన్నారట.



నల్ల బంగారం లాగ నల గా మెరుస్తూ వుంది మట్టి! బాగా గుల్లి గుల్లబారేటట్టు నాలుగుసార్లు లోతుగా దున్నిన ఆ నేలను లాగి బోదెలు తీసి మళ్ళు గట్టించు రాయప్ప బళ్ళతో తోలిన పెంటను గంపలతో మోసి దెచ్చి మళ్ళలో పోస్తున్నాడు వీరప్ప కొత్తగా పెట్టదలిచిన రామ్ములగ మొక్కలకి, చిక్కుడు పాదులకి రంగం సిద్ధమవుతుంది రామ్ములగ నారు కట్టలు బావిదగ్గర నగిపున్నాయి.

అటుపక్క 'నెరాబా'లో వంగతోట నవనవలాడగా గాలికి రెప రెపలాడుతూ వుంది ఆకుపచ్చగా ఎగుళ్ళా చిగుళ్ళా వేస్తున్న వంగ మొక్కలు పూతా కాతా మీద వున్నాయి. ఆ మొక్కల మధ్యన బుట్ట చేతో పట్టుకుని, తయారయిన వంకాయలు కోస్తోంది వీరప్ప కూతురు లక్ష్మి పోయిన శ్రావణానికి లక్ష్మిని పద్నాలుగు వెళ్ళి పదిహేనో ఏడు వచ్చింది. వొంటి రంగు చామన ఛాయే అయినా – పెద్ద పెద్ద కళ్ళూ, తీరయిన కనుముక్కూ, మంచి జుట్టూ, సన్నటి నడుమూతో, పొంగు కొచ్చిన యౌవనంతో, చెంగు నడుములో దోపి, మహాలక్ష్మి లాగ లక్ష్మి – తోటలో తిరుగుతో వుంటే చూడ ముచ్చటేసింది రాయప్పకి - నడుంకి చెయ్యి చేరవేసి కాసేపు అట్టాగే చూసాడు పూతతో వున్న వంగమొక్క లాంటి లక్ష్మిని

మోటబావి నుంచి బుంగ గుమ్మరించిన నీరు జల జలా బోదెలో నించి ప్రవహించి వస్తూ వుంది. ఆ నీటిని మళ్ళలోకి మళ్ళిస్తూ వుండిన చెంగప్ప పని ఆపి – రాయప్పదగ్గరికి వచ్చాడు అతని బనీను పూర్తిగా తడిసింది, చెమటకి నెత్తి పూర్తిగా నానిపోయింది.

'నే నెళ్ళి బండి గట్టుకు వస్తానే మామా!' అన్నాడు చెంగప్ప.

'అట్టాగే ఇంత ముద్ద తినిరా, పొద్దెక్కింది గదా' అంటూ పైకి చూసాడు రాయప్ప

పైన ఆకాశంలో మబ్బులు కదిలిపోతూ వున్నాయి. చల్లటి గాలి రాసుకుంటూ పోతూంది. దూరాన ఎక్కడో వాన బడుతున్నట్టు వుంది. వానలు పడితే మొక్కలకి ప్రాణం లేచి వస్తుంది.

చెంగప్ప బండి గట్టుకొచ్చి - వంకాయల్ని, బీరకాయలు, పొట్లకాయలు, సొరకాయల్ని, బెండకాయలు జల్లలో పోసుకుని – విడ్సుల్ని



# వానబడింది

పోటుకుస వెంకటేశ్వరరావు

అదిలిస్తూ బండి తోలుకు పోయాడు — బస్తీకి

ప్రొద్దు, వడినెత్తి మీదకి వచ్చింది. ఎండ చిట చిట లాడింది

గంపలో అన్నాలు బెట్టుకు నొచ్చి — బోయనాలకి పిల్చింది గంగమ్మ.

కాలు చేతులు కడుక్కొని అందరూ చింత చెట్టు క్రిందికి చేరారు — పనాపి.

తెల్లాటి అన్నంలో చింతకాయ పచ్చడి కలుపుకొని తిని — చిక్కటి కమ్మటి మజ్జిగ కడుపునిండా తాగారు రాయప్పా, వీరప్పా. లక్ష్మి వచ్చేటప్పుడే తిని వచ్చింది.

రాయప్ప చేతులు కడుక్కుంటూవుండగా అడిగింది గంగమ్మ — భర్తని

'రాయుడు గారు బస్తీకి వెళ్ళి వచ్చారంటగా ? కొడుకు కబుర్లు ఏమయినా తెలిసెనయ్యా ?'

'ఆఁ' అన్నాడు, రాయప్ప గంభీరంగా — ఇక తిట్లు మొదలెడతాడు — అనుకుని — మడుగులో గెడ్డేసినట్టూ, కడవులో కెలికినట్టూ మొహం పెట్టి — 'ఏ వం టా డబ్బాయి ?' అంది గంగమ్మ అన్నింటికీ సిద్ధమయ్యే

'శ్రేతి కబురెట్టాడు రాయదుగారు. విల్లాగా. నే తిరిగివచ్చే లలికి అంతా నిద్రల్లోతావున్నారు సర్లెమ్మని పడుకుండిపోయా. చీకట్లో లేచి ఇట్టావచ్చానయ్యె.'

'సర్సెరె సంగతులేంటో అని గదా నే నడిగేది!' అంది గంగమ్మ అసహనంగా

'నిన్న రాయుడు అబ్బాయి దగ్గరికెళ్ళాడంట ...'

'ఏమన్నాడబ్బాం రా?'

'అబ్బాయిని కలిశాడంట...'

'ఏం చెప్పాడంటబ్బాయి?'

'అబ్బాయిని కలిసి...'

'కలిశాడా?' గంగమ్మ ఆత్రంగా అడ్డు పడూతు వుంది మాట మాటకి.

'నన్ను చెప్పనిచ్చేదుందా ? నీ ఆత్రమే పాడు?' విసుక్కున్నాడు రాయప్ప.

'చెప్పమనేగా' చిన్నబుచ్చుకుంది గంగమ్మ.

'కలిసి— తన బాకీ సంగతి కదిపాడట.'

'కదిపాడూ? డబ్బు అంటే ఆ రాయుడు గారు పిశాచంలాగవుతాడు. అబ్బ.'

'ఎవరయినా అంతేగదా. నీ డబ్బయితే నువ్వు వూరుకుంటావా?'

'అవునమకో. కాని ఆ రాయుడు మరీ 'ఇది' గదా!'

వీరప్ప ఆ సంభాషణని వింటూ చుట్ట పొగ పీలుస్తున్నాడు. లక్ష్మి బావి దగ్గరగట్టు మీద నిలబడి గోరింటాకు కోసుకుంటూ వుంది— ఒడిలో.

పైన గాల్లో మబ్బులు తేలిపోయాయి. ఇక వాన బడేట్టు లేదు. భూమి అర్చుక పోతూ వుంది. పైనుంచి వావబడి నేల తడ వారిగాని ఇంతవరకని బావినుంచి తోడిపోసిన నీరు సరిపోతుంది? తోడి తోడి చేతులు పడి పోయి, పశువుల కాళ్ళు గాదులు కట్టటమే నాయె ఆ నీళ్ళు మొక్కల వేళ్ళనయినా చేర కుండానే గాలికావిరయినట్టువగా — మొక్కలు బోసిపోయి ఎండుమొహం పెడతన్నాయి. వాట్ని చూస్తే కడుపు తరుక్కుపోతావుంది. ఋతువులు సరిగ్గా నడిస్తే ఇది నడి వర్షాకాలం. ఆకాశానికి తెల్లగా మునుగుపడి దిమ్మరించిన వర్షాలతో భూమి నాని— మొక్కలు నవనవలాడూతు ఏపుగా అయి రోజాకి రెండు బళ్ళ కాయగూరలు దిగాల్సింది. అట్టాంటేది వానల్లేవు ఇది వానాకాలమేనా అనిపిస్తుంది. ఎండలు దంచి దంచి ఎండాకాలం వెళ్ళి పోయింది. వానాకాలం వచ్చింది గదా అని చంకలెగరేయటానికి ఏవీ వానలు? వుండి వుండి ఒక రోజా మబ్బులు పట్టుకువస్తాయి. ఇంతలో గాలి కొట్టుకు వస్తుంది. వచ్చి— ఆ మబ్బుల్ని తోలుకపోతుంది మునుర్లు లేవు. కుండపోత వర్షాలు లేవు. చెర్లునిండుటాలూ బావుల్లోని నీరు పైకి రావటాలూ లేదు. వానవాన అని నోరు తెరుచుకుని రోజూ ఎదురు చూడటమే గాని వానా బడదూ. మొక్కలూ దేబి మొఖాలు పెట్టాయి. నేల తల్లి పగుళ్ళు బారింది. ఇట్లా అయితేఎట్టా అని ?!

రాయప్ప చుట్ట వెలిగించాడు. గుప్ప గుప్పన పొగ లాగాడు అర్ధనిమీలితనేత్రాలతో చూసాడు. గంగమ్మ కళ్ళల్లో కొడుకు మెది లాడు. ఆమె గుండె గుబగుబలాడింది.

'అబ్బాయి ఎట్టా వున్నాడు?' అని అడిగింది ఆత్రంగా. రాయప్ప సాలోచనగా ఆమె కళ్ళల్లోకి చూసాడు.

కృష్ణమూర్తి లేకలేక పుట్టాడు. గారా బంగా పెంచారు కొడుకుని. చదువుచదువులవి చదివించారు.

'కొడుకు కొడుకు అని వూరేగావు నెత్తి మీద పెట్టుకున్నావు. చదువు అన్నావు. చది వించావు. వుద్ధరిస్తాడని వూరంతా చెప్పు కొన్నావు, నడుం విరగేసాడు ఇక ఏడ్వు' అని తిడతాడు రాయప్ప. అక్కడికి కొడుకు అంటే తనకేమాత్రం ఇదీ ఏం లేనట్టు?— అనుకుంటుంది గంగమ్మ.

ఆ చదువులు పూర్తయాకన్నా కొడుకు కృష్ణమూర్తి ఇల్లు చేరతాడని, పెళ్ళిచేసుకుని ఆ యింటివాడయి తలిదండ్రుల్ని చూసు కుంటాడనీ అనుకున్నాడు రాయప్ప. కాని చదువులు పూర్తిచేసి బస్తీకెళ్ళాడు కృష్ణ మూర్తి. వ్యాపారాలన్నాడు.సంపాదనలన్నాడు. కాలుమీద కాలు వేసుకుని కూర్చోమంటే అలా కాదని అప్పులుచేసి బస్తీకెక్కి వ్యాపా రాలు మొదలు పెట్టాడు. ఏందుకొచ్చిన బెడదలూ!

ఆ వళ్ళు చెరువు కింద మాగాణి ఎకరం ఆరువేలకి తెగనమ్మాడు. నీ ఏడుపు నువ్వు ఏడవమని కూర్చొన్నాడు రాయప్ప. ఆ పొలం యిప్పుడు పదివేలు పలుకుతావుంది. గంగమ్మ కొడుక్కి వత్తాసు పలికింది. అందుకే బంగారం లాంటి పొలం తెగనమ్మి దుంప నాశనం చేసినందుకు తిడుతాడు రాయప్ప. రాజా లాంటి పొలం! రాజనాలు పండుతుంది. అది చేతులు దాటిపోయింది. ఇంటిముందు పురుల్లో ధాన్యం దాచుకుని కాలుమీద కాలు వేసుకుని కూర్చోవలసిన సంసారం తోటనుబడి కూరలు అమ్మి బ్రతికే స్థితికి వచ్చింది. అయిన సంబంధం. వీరప్ప స్వయానా మేన మామ అవుతాడు. లక్ష్మి బంగారం లాంటి పిల్ల. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుని సంసారం సాగిస్తే ఈ పాటికి నలుగురు పిల్లల తండ్రయి వుండేవాడు. ఆ మాటావినడాయె. అలాగేలే. కాని ఇప్పుడు కాదంటాడు ఇట్టా ఏమాటా వినక ఏమయిపోదామని?

అదే రాయప్పకి దిగులు

ఆ మధ్యన వ్యాపారం వెలిగించినప్పుడు రాయుడు దగ్గర అప్పు పుచ్చుకున్నాడు, కృష్ణమూర్తి. ఆ బాకీ తాలూకు యింకా మిగిలివుంది వసూలుకని తరచూ బస్తీకి వెళ్ళి వస్తూ వుంటాడు రాయుడు. కృష్ణ మూర్తిని కలిసినప్పుడల్లా ఆ సంగతుల్ని రాయప్ప చెవిని వేస్తాడు.

'మీ అబ్బాయి బాగా చిక్కిపోయాడు రాయప్పా' రాయుడు అంటాడు. ఆ మాట విని రాయప్ప చిక్కిపోతాడు.

'పాపం వ్యాపారం ఎదురు తన్నిందట. బాగా నష్టం వచ్చింది. కృష్ణమూర్తి దిగులుగా వున్నాడు, సుమీ '

రాయప్ప దిగులుపడిపోతాడు.

'మీవాడు మిల్లునిండా ధాన్యం కొని పోసాడు, రేటు పడిపోయింది. వర్షానికి కొంత సరుకూ పాడయిందట. ఇంక ఆ వ్యాపారం ఎలా బ్రతికేటట్టూ. డౌనయిపోయాడు.'

రాయప్ప డౌనయిపోతాడు.

'ఇంకా, నా బాకీ నాలుగు వేలుంది. ఎప్పుడు తీరుస్తాడో ఏమో ?'

'నాల్రూపాయల వడ్డీతో కలిపా?' పళ్ళు కొరుకుతూ అడుగుతాడు రాయప్ప 'అసలీ వడ్డీలకు అప్పులూ వద్దూ, ఈ దారిద్రపు వ్యాపారాలూ మనకి వద్దురా అంటే వాడు నా మాటలు వింటేగదా?! పోనీమని వూర్కుంటా వుంటే ఇల్లు బీకి పందిరేస్తున్నాడు గదా!' అంటూ ఇదయిపోయి ఇంటికి వచ్చి శివాలు తొక్కుతాడు రాయప్ప

'వాడు ఇక బాగుపడడు. చెడిపోయాడు' అని దిగులు పడతాడు రెండు పూటలు ఆ దిగులుతో భోజనం మానేసినా, కడుపుమాడి మూడోపూట పీటమీద కూర్చుని అన్నం పెట్టమంటాడు. ఇది ఒకనాటిది గాదు. దీనికి పదేళ్ళ వయసుంది. కొడుకు వ్యవహా రాలకని పదెకరాల మాగాణి పరుల చేతుల్లో బడగా— చివరికి ఈ చెక్కలో కూరగాయలు బండించి—

'నిన్నే ఏంటా ఆలోచనలూ?' గంగమ్మ కదిపింది.

'తూరుపున నల్ల మబ్బులు తొంగిచూస్తా వున్నయ్యి వాన బడుద్దా అని నా ఆలోచన. వానబడాలి గాని— నీ యవ్వ— బంగారం పండించనూ?'

'నీకు మధ్యన మా యవ్వ వూసు ఎందుకూ?'

రాయప్ప నవ్వాడు.

'ఇంతకి అబ్బాయి సంగతుల్జెప్పలేదు' అంది

'ఎన్నడూ లేంది నిన్న రేత్రి పూట రాయుడుగారు నన్ను కూర్చోబెట్టి ఫలారం బెట్టి మర్యేద జేసి మాట్లాడాడే? అర్థ మవటంలేక ఈ ఆలోచన.'





సంపూర్ణ ఆరోగ్యానికి 3000 ఏండ్లనుంచి ప్రఖ్యాతిపొందిన

# డాబర్ చ్యవనప్రాశ కుటుంబ ఆరోగ్యాన్ని నాలుగువిధాలుగా మెరుగుపరుస్తుంది.



సి విటమినను సంపన్నంగా ఉండి తీపి, పులుపుల చక్కటి రుచితో సహజ రూపంలో లభించే మిశ్రమం

**1. శరీర కణాలను నిత్యం యవ్వనంలో ఉంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ శరీర కణాలు అరిగి, తరిగిపోయే ప్రక్రియ వేగాన్ని తగ్గిస్తుంది.

**2. శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ మొత్తం శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది. దగ్గు, రొంప నివారణకు కూడా మంచిది.

**3. చురుకుదనం పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ పిల్లలలో చురుకుదనం పెంచుతుంది. వృద్ధాప్యంలో మానసిక, శారీరక శక్తులను పెంచుతుంది.

**4. జీవకణ నిర్మాణ శక్తి.**
డాబర్ చ్యవనప్రాశ శరీరం క్రమంగా పెరిగి, దారుఢ్యంగా ఉంచుకోడంలో తోడ్పడుతుంది.

## దేవతల వంటకం

3000 ఏండ్ల క్రితం, చ్యవనుడనే ఋషి తన యవ్వనాన్ని తిరిగి పొందేందుకు, దేవతల వైద్యులు ఆయనను చ్యవనప్రాశ వాడమన్నట్లు చెబుతారు. ప్రపంచంలోని ప్రాచీన టానిక్ అయిన చ్యవనప్రాశను, ఇప్పుడు డాబర్‌వారు ఆధునికంగా, రుచిగా, తయారు చేస్తున్నారు.

ఆరోగ్య సంరక్షణకు ఆయుర్వేద ఔషధం డాబర్ చ్యవనప్రాశ

## డాబర్ చ్యవనప్రాశ

అన్ని మందుల దుకాణాల్లోనూ, కెమిస్టులవద్దా లభిస్తుంది.

5577 Tel

# వా న బ డిం ది

'మరేదేముందిలే పాటిపాడవు గదా?'

'అది గాదులే ఇందులో ఏదో మడత వుంది మామూల్ది గాదు'

'మన అబ్బాయి బాగా వున్నాడా? ఆ సంగతి చెప్పావా రాయుడు?'

'ఆఁ మనాడికి దశ దిరిగిందట ధరలు అటూ ఇటూ అయి – నీ కొడుకు యవారం జేసి మొన్న సీజన్లో బాగా గుద్దాడట! అద్దికి దీసుకున్న ఆ మిల్లునే కొనేసాడంట. వెంకటపూడ దారిలో రోడ్డుమీదుంది జూశావా? సినిమార్డ్సే చవుదరిగారి రంగుల మేడని మనాడు కొనేశాడంట! కారు కూడా వుందంట. కొన్నిరోజులపాటు ఈలవదు. తరవాత వస్తానన్జెప్పి మమ్మానాన్నలతో జెప్పమన్నాడంట. ఇయ్యేంయాపారాలే!'

'మరి రాయుడు గారి బాకిని దీర్చాడా?'

'రాయుడ్ని చూడగానే ఆయన్డబ్బాయన మొహాన కొట్టాడట. రాయుడుగారు నన్ను ఒక మాటడిగాడే' అంటూ అటు ఇటు చూసాడు రాయప్ప. వీరప్ప బావి దగ్గరకి వెళ్ళి నిలబడి ఆకాశంలో మబ్బుల కోసం వెతుకుతున్నాడు. 'ఏమడిగాడూ?'– గంగమ్మంది.

'పట్నంలో చదువుకునే తన కూతుర్ని మనాడికిస్తామా – ఆస్తి పాస్తులన్నీ రాసి ఇస్తానన్నాడు' గుస గుసగా అన్నాడు. గంగమ్మ తీవ్రంగా చూసి 'నువ్వేమన్నావూ?' అనడిగింది. రాయప్ప నవ్వాడు. లక్ష్మిని, వీరప్పని మార్చి మార్చి చూసాడు.

'మా వాడికి సంబంధం కుదిరిపోయింది. కుదరదని చెప్పొచ్చానే, నాకు దెలీదా?'

గంగమ్మ సంతృప్తిగా వూపిరి పీల్చింది. 'మొదట్నించీ ఈరప్ప మనల్నే నమ్ముకున్నాడు. లక్ష్మి గుణవంతురాలు. మనల్ని పువ్వుల్లో పెట్టి చూసుకుంటుంది తనంటే అబ్బాయికీ ఇదే' అంటూ హితవు పలికింది. రాయప్ప తలాడించాడు.

మోట తోలుడు మొదలయింది రాయప్ప లేచాడు. గంగమ్మ అన్నీ సర్దుకుని ఇంటి మొహం పట్టింది. గాల్లేదు. గాల్లో తడీలేదు. ఏంకాలం?!

పొద్దు గుంకుతూ వుండగా – మదించిన ఏనుగుల్లాంటి నల్లమబ్బులు కొన్ని వచ్చి ఆకాశాన్ని ఆక్రమించాయి. చల్లగాలి తగిలింది. టప టపమని మొదలయిన చినుకులు



# ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

## వెక్కిరింపు వ్యర్థం కాదు

కొందరు ఇతరుల వికార రూపాలనూ, వికారచేష్టలనూ చూచి వెక్కిరించి, తామెంతో ఘనులమైనట్లు ఆనందిస్తారు. అలా చెయ్యడం మేలైనదికాదు. దానికి తగిన ప్రతిఫలం వెంటనే కాకపోయినా మరొకప్పుడయినా అనుభవించవలసి వస్తుందేకాని ఊరికేపోదు.

దౌర్జన్యానికి రాక్షసరాజు రావణుడు మిక్కిలి పేరుపడ్డాడు. అతడు లంక నుంచి కుబేరుణ్ణి తరిమివేసి, అతని పుష్పక విమానాన్ని కూడా అపహరించాడు. అలాంటి ఆకాశయానం మరొకటి ఉన్నట్టు కనబడదు. రావణుడు దానిపై ఎక్కి తనకు తోచిన చోట్లలో విహరిస్తూ ఆనందించేవాడు. ఇలా విహరిస్తూ ఒకప్పుడు అతడు కైలాసపర్వతం మీదుగా తన విమానాన్ని పోనిచ్చాడు.

విమానం ఎప్పుడూ దేవతల నివాసాలపైనుండి వెళ్లకూడదు. అలా వెళ్లితే అక్కడ వున్న దేవతలను అవమానించినట్లవుతుంది. వారి శిరస్సును తన కాలితో తాకినట్లవుతుందన్నమాట. విమాన చోదకులు అట్టిదేదీ జరగకుండా అతి జాగ్రత్తగా ప్రక్కనుండి తమ విమానాన్ని పోనిస్తూ ఉండాలి. రావణుడు కైలాసపర్వతం ప్రక్కనుంచి కాకుండా పర్వతోపరిభాగం పైనుంచే విమానాన్ని పోనిచ్చి అక్కడ ఉన్న మహేశ్వరుని పట్ల మహాపరాధం చేసినవాడయినాడు.

మహేశ్వరుని సేవకులలో అతిముఖ్యుడైన నందీశ్వరుడు రావణుని దురాగతాన్ని గమనించాడు. అతనికి ఆ రాక్షసరాజుపై తీవ్రమైన కోపం కలిగింది. అతడు ఆ పుష్పకవిమానాన్ని కదలకుండా చేశాడు.

మిక్కిలి వేగంగా పోతూవున్న తన విమానం తటాలున నిలిచిపోయినందువల్ల, దానికి కారణమేమిటా? అని రావణుడు క్రిందికి చూచాడు. అతనికి వికారమైన కోతి ముఖం గల నందీశ్వరుడు కనబడ్డాడు. అతడే తన ప్రభావంవల్ల విమానాన్ని నిలిపివేశాడని రావణుడు గ్రహించి కోపంతో "ఓరీ కోతి ముఖం వాడా! నా విమానాన్ని నిలుపుతావా?" అని ఆక్షేపిస్తూ గద్దించాడు. నందీశ్వరుడు "దేవదేవుని నివాసం మీద నుంచి పోవడం కాకుండా నన్ను వెక్కిరిస్తావా? ఆ కోతి వల్లనే నీకు పెద్ద ఉపద్రవం కలుగుతుందిలే!" అని అన్నాడు. నందీశ్వరుడు క్రిందనుంచి పలికిన మాటలు రావణుడికి స్పష్టంగా వినబడలేదు. కాని ఏదో అన్నట్లు మాత్రం గ్రహించాడు.

నంది వాక్యానికి ఫలితంగానే లంకలో ప్రవేశించిన హనుమంతుడు అశోకవనాన్ని ధ్వంసంచెయ్యడం, రాక్షస వీరులను సంహరించడం జరిగింది. ఇది జరిగిన తర్వాత రావణుడు గ్రహించాడు — నందీశ్వరుని శాపం వల్లనే ఇలా జరిగిందని.

---

జోరున కురిసే వానగా మారాయి — అంతలోనే,

ఆనందంతో గంతులు వేసినంత పని జేసాడు రాయప్ప.

'ఏహెయ్! ఏహెయ్!'అంటూ ఎద్దులని అదిలిస్తున్న చెంగప్ప గొంతు వినపడింది. గుట్ట మలుపుదిరిగినకాడబండి వచ్చి ఆగింది. ఆ బండిని జూసి చెంగు చెంగున పరుగున చేరబోయిన లక్ష్మి — అంత దూరంలోనే తల వంచుకుని నిలబడిపోయింది — మరేంజూసిందో ఏమో!

వాన, జోరున వాన, కరువు దీరేలాగ కురిసే వాన— భూమిని ముంచేస్తున్న జోరు వాన! 'మామా!' చెంగప్ప పిలుస్తున్నాడు.

'ఎవరొచ్చారో, జూడు మామా!'

'ఎవర్రా ఆ వచ్చింది?' తెల్ల తెల్లగా వున్న ఆ వ్యక్తిని పోల్చుకోలేక అడిగాడు రాయప్ప. బండి మీద కూర్చుని వున్న తెల్లబట్టల ఆకారం మాట్లాడింది.

'నేనే నాన్నా.'

ఆ గొంతు కృష్ణమూర్తిది!

రాయప్ప గుండెలు ఆనందంతో ఎగిరెగిరి పడ్డాయి. సంతృప్తితో రాయప్ప మనసు కొట్టుమిట్టాడింది. వాత్సల్యం వరద లాగ పొంగింది. వానలాగ కురవబోయింది.

'పదండి. పదండి, ఇంటిదగ్గర అమ్మ వుంది, వానలో తడవకండి, జబ్బు చేస్తుంది. పదండి. లక్ష్మీ, నవ్వూ బండి ఎక్కరాదూ?' అన్నాడు ఆనందాన్ని అణచిపెట్టూ.

బావ వున్నాడని బండి ఎక్కని లక్ష్మి అప్పటికే ఇంటిదారి బట్టింది.

'ఏహెయ్ ఏహెయ్!'— చెంగప్ప అదలింపుకి బండి కదిలింది. బండి మీద కృష్ణమూర్తి, ఆ బండి ననుసరించి — రాయప్ప, అతని వెనకే అడుగులు వేస్తూ వీరప్ప.

వాన బడుతూ వుంది. కుంటలో దిమ్మరించినట్లు — తెల్లగా ముసురేసి — చాలా చాలా కాలానికి వచ్చిన వానకి బీటలు బారిన నేల తల్లి గుండె చల్లబడింది.

# ★ వారఫలం ★

**18-12-1981 శుక్రవారం మొదలు 24-12-1981 గురువారంవరకు**

మేషం: అనుకొనని మార్పులు వ్యాపారంలో చేయనున్నారు. మంచిని గ్రహించి, మంచిగామెలగే మీ ప్రకృతిగా రోజులన్నీ బాగుంటాయి. ధనం కూడా వ్యాపార మార్గాన ఆశించే వారికిలభిస్తుంది. ఉద్యోగం చేసికొనే వారికి, 'సినీ' వ్యాపారంలోని వారికి అనుకూలమే స్త్రీలకు శుభ కార్యానుకూలత, ఉద్యోగావకాశాలకు మంచి వారం

వృషభం బంధు సమాగమం గల సమయమే. అయినా లాభం? నిష్ఠూరాలతో, అపనిందలతో, అనవసరమైన గొడవలతో, మనస్పర్థలతో వారం గడుస్తుంది అసలు, యిలాగేనా? అంటే మధ్య మధ్య స్వల్పాదాయానికి మార్గం లేక పోలేదు వస్తు సామగ్రి పోకుండా చూచుకోవడం అవసరం. స్త్రీలకు సుఖశాంతులకు లోపం, విద్యకు అంతరాయం, కృషి లోపానికి అవకాశము గలవారం

మిథునం ఆకళింపు చేసికొని, నిదానంగా విషయాలు గ్రహించండి భయభక్తులు, నీతి నిజాయితీ గలవారు కావటంతో, వచ్చిన యిబ్బంది తొలగి పోతుంది రావలసిన స్వల్ప ధనానికి అంతరాయం లేదు స్త్రీలకు గౌరవం, ఆదరం, పెద్దల అభిమానం, వ్యాపారానుకూలత కొందరవిషయములో చెప్పదగిన అంశాలు.

కర్కాటకం భారీ వ్యాపారస్థులు మీరైతే, ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుంది. మీరు,రచయితలైతే, రచనా పాటవానికి పటుత్వం ఏర్పడుతుంది 'కంట్రాక్టు' వైద్య వృత్తులు ఒకవిధంగా లాభప్రదాయకాలే స్త్రీలకు: నూతన విషయాలు తెలిసికోవటం, నూతనాంశాలు గ్రహించటం జరిగిపోతుంది.

సింహం వాస్తవానికి చాల సమీపమునకు రాగలవు, మీకు జరుగవలసిన వ్యవహారాలు, దైవకార్యాచరణం, ఎలాంటి అంతరాయాలు లేకుండా సాగి పోతవి పెద్దల అనుభూతి సుముఖాడే ఉనాలుగా భావించండి స్త్రీలకు గౌరవాభివృద్ధి పెంపు, ఆనందం, కార్యాచరణకు అవకాశాలుండమన్నవి.

కన్య: గ్రహించండి. దూర బంధువులనుండి ఆత్మీయులనుండి అనుకూల వార్తలు వినగలుగుతారు. పోయిన వస్తువులు మరలా దొరుకుతాయనే ఆశ జనిస్తుంది. క్రీడావనిలో నూతనావకాశాలు చిక్కుతాయి. స్త్రీలకు: బంధు సమాగమం, పెండ్లి పేరంటముల చర్చ, స్వల్పాదాయం సంభవం.

తుల ఈ వారంలో మీరు మానసికంగా ఆలోచించేదొకటి, అయ్యేదొకటి మీ బాగోగులకుగాని, ఉద్యోగ ప్రగతి సాధనకు గాని, మీరే బాధ్యులని గ్రహించి వ్యవహరించాలి వ్యాపారస్థులకు పోటీ హెచ్చుటంతో, చేసిన పొరబాట్లు సర్దుకోవటంతో కాలం వ్యయించాలిసి వస్తుంది స్త్రీలకు అన్ని రంగాలలో సామాన్య ఫలితములే అని గ్రహించాలి

వృశ్చికం జాయింటు వ్యాపారంలోరేగిన కలతలు క్రమంగా సాగిపోతాయి అధిక లాభాలకు ప్రయత్నించకండి తగిన వారి స్నేహం ఉన్నది, వదలకండి. శుభకార్యాలను గూర్చిన తాపత్రయాన్నిఅణగదొక్కకండి స్త్రీలకు దూరదేశ ప్రయాణానికి, పెండ్లి పేరంటములకు ప్రయాణించటం సంభవం.

ధనుస్సు నూతన విషయాలు తెలిసికొంటారు. నూతనంగా విలువ గల వస్తువులు కొనుగోలు చేసే ప్రయత్నముంటుంది. బంధువులను గూర్చి, వారి సమస్యలను పరిష్కరించుటకు, ఏవో ప్రయత్నాలు చేయనున్నారని గ్రహించాలి. స్త్రీలకు సుఖశాంతులు, కించిత్తు ఆదాయం, నూతన వ్యక్తులను కలిసికోవటం నిశ్చయం.

మకరం వ్యాపారానికి లోపమని గాని, సాధారణంగా జరుగవలసిన వ్యవహారాలకు అంతరాయాలుంటాయని గాని, పేరు పెంపులకు అవకాశం లేదని గాని, ఆదాయం రాదని గాని, అభిమానుల ఆదరణ ఉండదని గాని చెప్ప వీలు లేదు సర్వవిధాలా మేలైన దినమే స్త్రీలకు వస్త్ర సేకరణకు, వస్తు సేకరణకు నగలు చేయించుకొనుటకు,ధరించుటకు అవకాశం గల దినాలే.

కుంభం సుఖ శాంతులకు లోపం లేదు. వస్తువులు కొనుగోలు చేయుటకు, వ్యాపారంలో ఆర్జనకు, వ్యవహార పరిష్కారానికి సర్వ విధాలా వీలు గల వారమే. మీ వలన మేలు పొందినవారు, ఇతర ప్రాంతాల నుండి రానున్నారు మీకేదో సహకరం చేయనున్నారు గ్రహించి మెలగండి. స్త్రీలకు: కుటుంబానందం, శుభకార్య మాసించు వారికి మేలు సంభవం

మీనం: గ్రహించండి. ఆదాయమున్నది.జరుగవలసిన వ్యవహారాలు సుకరంగా సాగనున్నాయి, అంతరాయాలేమైనా ఉన్నా, దైవానుగ్రహంవలన, పెద్దల ఆదరణకు అనుకూలత గలదు. స్త్రీలకు: కార్యాచరణకు అనుకూలం. ఆరాధ్య దైవం మేలు సమకూర్చనున్నాడు. గ్రహించండి. నూతనవ్యవహారాలలో విజయం చేకూరనున్నది.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# మీరు జాగ్రత్తకలవారు కాబట్టే..



ఈ గడ్డు ప్రపంచంలో మీ బిడ్డ భవిష్యత్తు మీ చేతుల్లోనే ఉంది. తనకి అవసరమైన విద్యాభివృద్ధికై మీరెంతో పాటుపడుతారు.

మీ చిన్నారిబాబు అవసరాలు పెరగకముందే పొదుపు ఆరంభించండి. అతనితోపాటు పెరిగే మీ బాధ్యతలపై **కెనరా బ్యాంకు** మీకు సులభతరంగా ఎన్నో పథకాలను నిర్వహిస్తోంది.

**"విద్యానిధి"** డిపాజిట్ మీ బాబుతో పెరిగి, అతని భావి చదువుకు చేయూతనిస్తుంది. **"నిరంతర డిపాజిట్"** పథకం ప్రకారం, మీరు ప్రతి నెల వేసిన చిన్న మొత్తాన్ని సయితం ఏడు సంవత్సరాలు తర్వాత నెలసరి మేం చెల్లిస్తాం. దీనివల్ల మీ మూల ధనం తరగదు.

**"కెనరా బ్యాంక్"** మీ బాధ్యతలను పంచుకొంటుంది! ఇంకా **కామధేను సేవింగ్స్ రికరింగ్ ఫిక్సెడ్ డిపాజిట్** పథకాలు కూడా ఉన్నాయి.
నేడే మీ బ్రాంచికి రండి.

## కెనరా బ్యాంక్

(జాతీయ బ్యాంక్)
దేశము మొత్తమున **1.300** కు పైగా శాఖలు కలవు.

GROWING TO SERVE · SERVING TO GROW · CANARA BANK

maa (S) CB 13 b Tel 81

# తార

శ్రీమతి-వాజ్ఞా

(గత సంచిక తరువాయి)

తారకు వరుడుగా ప్రసాద్ ఇంట్లోనే ఉన్నాడనే ఉద్దేశంలో తెలిసిన ప్రతివాళ్ళతో "రెండో అమ్మాయి సరళకు మంచి సంబంధముంటే చూడండి" అని చెబుతుండేవారు రాఘవయ్యగారు

అలాగ చెప్పిన మిత్రులలో ఒకరు సరళకు ఒక సంబంధం తెచ్చారు 'ఒక్కడే అబ్బాయి, ఇద్దరు అమ్మాయిలు! అమ్మాయిలకు పెళ్ళిళ్ళు అయిపోయాయి! నాలుగెకరాల పొలం, ఒక మండువా పెంకుటిల్లు ఉన్నాయి! తల్లి రోగిష్టిది కానీ, తండ్రి బలంగానే ఉంటాడు వ్యవసాయం అదీ అంతా ఆయనే స్వయంగా చేసుకుంటున్నాడు ఇంక వరుడు — ప్రకాశరావు కమీషన్ వ్యాపారి దగ్గర గుమాస్తాగా పనిచేస్తున్నాడు' ఆ సంబంధం అందరకూ నచ్చింది ముఖ్యంగా నాగరత్నమ్మకు బాగా నచ్చింది సరళ కూడా ఇష్టపడింది

వరుని తల్లి రోగిష్టిదవటంవల్ల పెళ్ళి త్వరగా చేసెయ్యాలని అడిగిందట

రాఘవయ్యగారికీ త్వరగానే చేయాలనిఉంది కానీ — తార!?

ప్రసాదు నిర్ణయం విన్నాక తారకు కూడా వేరే సంబంధం చూడవలసి రావటంతో — ఆగవలసి వచ్చింది కానీ ఇప్పుడు మునసబు మామయ్య పుణ్యమా అంటూ ఆ సంబంధమూ స్థిరపడింది 'ఇంక రెండు మూడునెలల్లో మంచిరోజులొస్తున్నాయి పసుపు కుంకుమలు మార్చుకుందాము' అనుకున్నారు

రాఘవయ్యగారికి అన్నకొడుకు సుబ్బారావు కూడా బి ఏ చదువుతున్నాడు గుడివాడ కాలేజిలో సుబ్బారావూ, వెంకట్రావూ కలిసే చదివారు అయితే వెంకట్రావు చురుగ్గ చదివి పాసైనాడు సుబ్బారావు ఇంకా చదువుతూనే ఉన్నాడు

మునసబు మామయ్య అంతామాట్లాడి స్థిరం చేసాక వెంకట్రావు సుబ్బారావు దగ్గరకు ఎక్కువగానే వస్తూపోతూ ఉండేవాడు మొదటిసారి వచ్చినపుడు అతనెవరో ఎవరికీ తెలియలేదు కేవలం సుబ్బారావు స్నేహితుడుగానే అనుకున్నారు రాఘవయ్యగారి అన్నదమ్ములు ముగ్గురూ మూడు ఇళ్ళల్లోఉన్నా, ఆ మూడిళ్ళూ ఒకే లోగిలిలో ఉండేయి! తారకూడా అన్నయ్యకోసం వచ్చిన స్నేహితుడు అనే ఉద్దేశంతోనే పనిమీద అటూఇటూ తిరుగుతూనే ఉన్నది

తారను చూసి ఆనందపడ్డాడు వెంకట్రావు అయితే 'బాబాయి' చెప్పినట్లుగ తార 'గొప్ప అందాలబొమ్మ' అని అతని మనసు ఒప్పుకోలేదు

'మగవాడు తృప్తిగా బ్రతకటానికి అనువయిన భార్య!' అని మాత్రం అనుకున్నాడు వెంకట్రావు

అలా రెండు మూడుసార్లు వచ్చి వెళ్ళాక తెలిసింది అందరికీనూ, 'తార కోసంగా మునసబు మామయ్య చూసిన వరుడు ఈ వెంకట్రావే' అని

ఒక్క తారకు తప్పించి అందరకూ అతను చాలా బాగా నచ్చాడు

తారకు నచ్చకపోవటానికి ముఖ్య కారణం — అతను నల్లగా ఉండటం! ఆ నలుపు తారకు ఇష్టంలేదు! అలా అని చెప్పే ధైర్యమూ లేదు! 'పోనీలే' అని సరిపుచ్చుకుందుకు 'ఒక్క పూటకేకదా అని కళ్ళు మూసుకుని మింగే వంకాయకూర కాదు కదా! జీవితం అంతా భరించాలి! రేపు పిల్లలు పుట్టినా అదే నలుపూ, ఆ ఎత్తుపళ్ళూ వచ్చినట్లయితే — అమ్మబాబోయ్! నాకొద్దు!' ఊహలే ఇంత భయంకరంగా ఉంటే — రేపు ఒకవేళ నిజంగా నిజం అయితే భరించగలనా! ఏమయినాసరే నాకొద్దు!' అని మనసు మొరాయిస్తున్నాది

* * *

**జరిగిన కథ — 1** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ — రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం అందరిలోకీ పెద్దది, అందం, వినయవిధేయతలు కల 'తార' అంటే రాఘవయ్యగారికి ప్రాణం సరళ బడక్కస్తురాలు, పైగా గడుసు స్వభావం కలది రామారావ్ అదో తరహా మనిషి! మోహన్, చంద్రాలకు ఇంకా బాల్యావస్థ వీడలేదు చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేసి, చదువు చెప్పిస్తున్న తమ్ముడు ప్రసాద్‌కు తార నిచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటుంది నాగరత్నం రాఘవయ్య కూడా కాదనలేదు కానీ ప్రసాద్ పరశురామయ్య పెద్దకూతురును చేసుకొంటానని చెప్పగా ఏడ్చి అతన్ని బయటకు గెంటేస్తుంది ఆ ఇంటి అప్పుడు మునసబు మామయ్య తారకు ఓసంబంధం చూస్తుంటాడు

నాగరత్నమ్మ కన్నవారింటినుండి బండి వచ్చింది

'ప్రసాదు బాబుకు లగ్నపత్రిక వస్తున్నాది అందువల్ల నాగరత్నమ్మ గారినీ, పిల్లలనూ తీసుకురమ్మని అమ్మగారు పంపారు" అన్నాడు బండివాడు

విరుచుకుపడింది నాగరత్నమ్మ

"నాతోచెప్పి చేస్తున్నాడా? నాతోచెప్పే ఈ సంబంధం స్థిరపరచుకున్నాడా? నాతో చెప్పే పిల్లను చూసిందా? ఏ విషయం నాతో చెప్పింది గనుక — ఈనాడు లగ్నపత్రిక వస్తున్నాదని కబురు పంపించింది? బండి పంపగానే ఎరుగెత్తుక వచ్చేస్తాననుకుందా? నేనేమంత వెర్రిముండనను కుందా? నాకు సిగ్గూ లజ్జాలాంటివేవీ లేవనుకుంది దాబోలు నా కూతుర్నికాదని నా కడుపులో చిచ్చుపెట్టి బయటకువెళ్ళి మరోదాన్ని కట్టుకుంటుంటే టంగురంగా అంటూ వస్తాననుకున్నదా! ఆ ఇంటికి పెద్దకూతురుగా వచ్చి ఆ శుభకార్యాల్లో నాచేయి ఆసరా ఇచ్చేట్లుగానే ప్రవర్తించిందా! తను మరిచిపోగలదేమోగానీ, నేను నేనెట్లా మరచిపోతాను! నా ఒళ్ళు మండి పోతున్నాది నేనురాను — పొండి" అంటూ కసిరి పంపేసింది

మధ్యలో ఒకసారి రాఘవయ్యగారు మందలించబోతే "మీకేం తెలీదు, మీరూరుకోండి" అనేసింది

"నాకూ ఆ ముదినేపల్లికీ ఏనాడో ఋణం తీరిపోయింది" అంటూ ఏడ్చేసింది

* * *

కొడుకు అత్తవారు లగ్నపత్రికలో పెట్టిన చీర, లడ్లు, కారంబూంది, అరటిపండ్లూ తీసుకుని కూతురి దగ్గరకు వచ్చింది తల్లి

తల్లిని చూడగానే ఎక్కడ కేకలువేసి నానా రభసా చేస్తుందో అని భయపడిన రాఘవయ్యగారు భార్యను ప్రక్క గదిలోకి తీసుకెళ్ళి హితబోధ చేసారు

"ఏమైనా గొడవ చేసావో ఊరుకునేది లేదు ఇష్టమైతే పెళ్ళికి వెళ్ళు, లేకుంటే లేదు! అంతేకానీ ప్రయోజనంలేని దానికోసమూ, జరిగిపోయిన దానికోసమూ ఊరకే నోరు పారేసుకుని రభస చేయటం నాకేమాత్రం ఇష్టం ఉండదు జాగ్రత్త!" అంటూ హెచ్చరించారు

అమ్మమ్మ చాపమీద పరిచిన వస్తువులన్నీ లోపల సర్ది వచ్చింది తార

అల్లుడు భోజనానికి వచ్చినపుడు తలుపు చాటున నిలబడి క్షమాపణ అడిగింది

రాఘవయ్యగారు నవ్వేసారు 'అదేదో పిచ్చిదాని లాగా అనవసరంగా నోరు పారేసుకున్నాది దానికి మీరేమీ బాధపడకండి 'తారను ప్రసాదుకు చేసుకుంటాము' అని మీరు మాకేమీ వాగ్దానాలు చేయలేదు! వాడేదో తెలివికల కుర్రాడు కాబట్టి తీసుకొచ్చి చదివించానేగానీ, అల్లుణ్ణి చేసుకోవటానికని ఆనాడు నేనూ అనుకోలేదు! ఏదో పెద్దవాళ్ళం కాబట్టి చాదస్తంకొద్దీ ఏవేవో అనుకుంటాము! అనుకున్నవన్నీ జరుగుతాయా! అయినా మన ఆలోచనలకు వాళ్ళను కట్టిపడేయటం ఏం ధర్మం? మీరూ నాగరత్నంలాగా సంకుచితంగా ఆలోచించకండా ప్రసాదు నిర్ణయాన్ని సమర్థించటం

నాకు చాలా సంతోషంగా ఉన్నాది! నాకు తార ఎంతో ప్రసాదూ అంతే! వాడి కోర్కెను తీర్చటం మన బాధ్యత! ఎవరు ఎవర్ని పెళ్ళి చేసుకున్నా — వాళ్ళు సుఖంగా బ్రతకటమే మనకు కావలసింది!'' అంటూ చేయి కడుక్కుందుకు లేచారాయన

పెళ్ళికి తప్పకుండా రమ్మనమని చెప్పింది. అందర్నీ బట్టలు కొనుక్కోమని నాలుగువందల రూపాయలు తీసి ఇచ్చింది

భోజనం చేసి వెళ్ళిపోయింది

* * *

"అమ్మా! ప్రసాదు పెళ్ళికి వెళ్దామా ?''

"సిగ్గు లేకపోతేసరి! పెళ్ళికి వెళ్తుందిట! పెళ్ళికి!'' అంటూ పళ్ళు నూరుతూ మరీ తిట్టింది

ప్రసాదు పెళ్ళికి వెళ్ళేందుకు ఎందుకు సిగ్గు పడాలో తారకు అర్థంకాలేదు

అంతేకాదు! అసలా అమ్మాయికి 'ప్రసాదు వేరే పెళ్ళి చేసుకుంటున్నాడే' అనే బాధే కలగలేదు! అసలా వార్త ఆ అమ్మాయిలో ఎలాటి సంచలనమూ కలిగించలేదు!

ఎందువల్ల ?

జరగాల్సిన పెళ్ళి ఆగిపోతే, అది - ఆడపిల్లకెంత అవమానమో, ఎన్ని సమస్యలను సృష్టిస్తుందో, ఎన్ని అవహేళనలకు గురిచేస్తుందో, ఎంతటి దుష్ఫలితాలను ఎదుర్కోవాలో అర్థం చేసుకోలేని పసివయసేమీ కాదు తారది!

ఆమెకు అన్నీ తెలుసు!

ఎందుకు తెలవవు ?

వెంకట్రావుని పెళ్ళి చేసుకోవటానికి అభ్యంతరం చెప్పటం చేతవయిన మనసుకు ప్రపంచపు పోకడ లర్థంకాక పోదు!

కాని —

ఆమె మనసుకు ప్రసాదు తిరస్కారం ఏ మాత్రం బాధను కలిగించలేకపోయింది

దానికి కారణం - బహుశా ఆమె మనసులో ప్రసాదుకు అంతటి బలమైన స్థానం లేదేమో!

అయి ఉండవచ్చు!



చిన్నప్పట్నుంచీ ఇంట్లోనే ఉంటూన్న వాడు! కలిసిమెలిసి తిరిగినవాడు!

చంద్రం, మోహన్‌లతో ఎంత చనువుగా ఉంటుందో — ప్రసాద్‌తోనూ అంతే చనువుగా ఉంటుంది

కాకపోతే అతను మేనమామ కాబట్టి, ఎరుప కాబట్టి, అన్నింటినీ మించి పల్లెటూరు కాబట్టి, అందరూ వరుసలు కలిపి హాస్యమాడితే విసీ, విసీ — ఆ మాటలు అగౌరవపు ముద్రవేసుకున్నాయి

అంతేకానీ తారలోని స్త్రీత్వాన్ని కదిలించి, ఆమెలోని ప్రేమమూర్తిని తట్టిలేపి, ఆమె కన్నె హృదయంలో మధురమైన భావాలను కలిగించలేక పోయాడు ప్రసాదు!

తారకే కాదు! ఏ ఆడపిల్లకయినా అంతే! ఆడపిల్ల అనేకాదు, మగపిల్లవాడయినా అంతే!

తాళికట్టిన ప్రతివాడూ 'భర్త' అవ్వలేడు! అలాగే కట్టించుకున్న ప్రతిస్త్రీ 'భార్య' కాలేదు

అలాగని కట్టుబాట్లకు దూరంగా, ఎదిరించి— సమాజపు సభ్యులుగా ఏ వ్యక్తీ బ్రతకాలేరు

జీవితంలో రాజీపడిపోయి, అదొక యంత్రంలా- గానుగెద్దులా — ఆ జీవితాలు అలా కాలెండర్లో కాగితాలులా జరిగిపోతూనే ఉంటాయి

కాని, జీవితంలో ఎపుడో ఒకసారి, ఎక్కడో ఒకచోట — మనసుని కదిలించి, వీణగా మీటగలిగి, సప్తస్వరాలను అతి మృదువుగా పలికించగల వ్యక్తి— ప్రతివ్యక్తికీ తారసపడతారు

అదే — నిజమైన ప్రేమ!

ఆ మానసిక స్పందన, ఆ అలౌకిక అనుబంధం, ఆ అనిర్వచనీయమైన అనుభూతీ — అందరకూ అనుభవించే అదృష్టం ఉండలేకపోవచ్చు!

కేవలం అదృష్టమే కాకుండా అవకాశం కూడా ఉండకపోవచ్చు!

కన్నెపిల్లలయితే కాస్త ధైర్యం చేస్తే ఆ అదృష్టాన్ని పొందగలరు కాని, పెళ్ళి అయి సంసార బంధంతో ముడివేసుకుని పెనవేసుకు పోయినవారు ఉహూఁ — అది, అసంభవం!

అయినా—అలాటి సంఘటన ఎదురయినపుడు— మనసు క్షణికమయినా చలించక మానదు

మనిషిని శారీరకంగా బంధించగలరు కానీ, ఏ శక్తీ కూడా మానసికంగా బంధించలేదు!

బహుశా, దానినేనేమో జన్మజన్మల బంధం అనీ, పూర్వజన్మ అనుబంధం అనీ ఏవేవో పేర్లతో కవులు వర్ణించుతూంటారా?

అవునేమో! -

బహుశా, అందువల్లనే తారకు కించిత్ కూడా బాధ అన్పించి ఉండదు

అందుకే ఆమెకు ప్రసాదు పెళ్ళికి వెళ్ళటానికి ఎందుకు సిగ్గుపడాలో కూడా అర్థంకాలేదు

తండ్రిని అడిగింది

రాఘవయ్యగారు వెళ్ళమన్నారు అనటమే కాకుండా ప్రసాదు కోసంగా పంచవర్ణపు రాయి పొదిగిన ఉంగరం ఒకటి, ఒక వెండి కంచం, ఒక వెండిగ్లాసు కొని తారకిచ్చి, రెండెడ్ల బండికట్టించి మరీ పంపారు

"నాకు వీలుకావటంలేదు కాని లేకపోతే

# తార

నేనూ వచ్చేవాడ్ని జాగ్రత్తగా వెళ్ళిరా తల్లీ! నేను రానందుకు ప్రసాద్‌నేమీ అనుకోవద్దని చెప్పు మీ అమ్మమ్మతో కూడా చెప్పు! అరేయ్ అమ్మాయిగార్ని జాగ్రత్తగా తీసుకెళ్ళు!" బండి నడిపి కూడా హెచ్చరించారు

* * *

అంతా క్రొత్తగానూ, సందడిగానూ ఉంది అన్నీ క్రొత్త ముఖాలే!

బెరుకు బెరుగ్గా అమ్మమ్మ వెనకాలే తిరుగుతున్నాది తార

పరశురామయ్య తమ్ముడు శ్రీనివాసరావు కూడా ప్రసాదుతోనే కలిసి ఒకే తరగతిలో చదువుతున్నాడు అతడూ, ప్రసాదూ ఒక క్లాసులోనివాళ్ళే అయినా ఇద్దరికీ చెప్పుకోదగ్గ స్నేహం ఏమీలేదు

ప్రసాదులోని 'తన' గూర్చి మాత్రమే ఆలోచించుకునే మనస్తత్వం శ్రీనివాసరావుకు నచ్చదు! అలాగే శ్రీనివాసరావు చెప్పే రాజకీయాలు ప్రసాదుకు నచ్చేవికావు!

అందువల్లనే వారిద్దరిమధ్యా స్నేహభావం లేకుండాపోయింది! అంతేకాదు — అన్నదమ్ముల మధ్యకూడా అంతగా సామరస్యముండేదికాదు అన్నగారి భావాల్లో ఏ ఒక్కటీ నచ్చని శ్రీనివాసరావు — అతనింట్లోకూడా ఉండేవాడుకాడు! అన్నా, వదినా బలవంతం చేసినా ఏదో ఒక సాకుపెట్టి బయటనే ఉండేవాడు!

అప్పటికే దేశంలో కమ్యూనిస్టుపార్టీ తీవ్రంగా ప్రచారంలోకి వచ్చింది! యువకుల్లో చాలామంది కొందరు రహస్యంగానూ, మరికొందరు పబ్లిగ్గానూ కూడా అందులో తిరుగుతుండేవారు!

ఆరోజు కూడా విజయవాడలో జరిగిన

## స్వప్న సాఫల్యం

అడుగడుగునా అవాంతరాలు
అధిగమించే చోట ఒక నిశ్వాస,
అధిరోహించే వేళ ఆయాసం
అందుకోవాలనే ఆనందం
అడుగులు వేయడంలోనే వుంది నిరంతరం

ఫలితాన్ని ఆశించకుండనే
ప్రయత్నించమనడం
పరోక్షంగా తుదముట్టించే ప్రలోభం

ఎన్నో అర్ధరాత్రులు
నీ స్వప్నాలను భూస్థాపితం చేసుకున్నా —
ప్రతి ఉదయం మరో స్వప్నం
మొలకెత్తి చేతులు చాచడం సహజం

అవరించిన క్రూరత్వం
అనంతమనిపించినా
అది నీ కాళ్లకింది మట్టి
తొక్కినపుడే నీ స్వప్న సాఫల్యం!

— విఖిల్

కమ్యూనిస్టు మీటింగుకు హాజరయ్యాడు శ్రీనివాసరావు

"అన్నయ్య కూతురి పెళ్ళి! వెళ్ళాలి! కానీ - మీటింగు?" పెళ్ళికన్నా ఇదే ముఖ్యం — శ్రీనివాసరావు దృష్టిలో! 'కానీ, వెళ్ళకపోతే బావుండదు' మనసులో జరుగుతూన్న తర్జనభర్జనలు మీటింగు మొదలవటంతో ఆగిపోయాయి!

ఉపన్యాసం ఆవేశంగా సాగిపోతున్నాది! యువజన రక్తం ఉద్రేకంతోనూ, ఆశయాలతోనూ పొంగుతున్నాది!

అన్నీ మర్చిపోయాయి!

తల్లీ, తండ్రీ, భార్యా, పిల్లలూ, చదువూ, ఉద్యోగాలూ, బాధ్యతలూ-సమస్తమూ వదిలేసారు! ఆ సమయంలో వాళ్ళ బుర్రలనిండా అమాయకత్వంతో అన్యాయంగా అణగిపోతూన్న వెనుకవర్గాలవారే నిండిపోయారు! ఆ పేదవాళ్ళ దౌర్భాగ్యాన్ని ఆసరా చేసుకుని — వాళ్ళ జీవితాలను కాళ్ళక్రింద నల్లుల్లాగా నలిపేస్తూన్న ధనమదాంధులే వాళ్ళ మనసంతా ఆక్రమించుకున్నారు!

"ఈ వ్యత్యాసాలు పోవాలి! ప్రతి జీవీ ఆనందంగా బ్రతగ్గలగాలి!

ఆ సమానత్వం కావాలి!

ప్రకృతి అందిస్తూన్న ఈ సంపదలు ప్రతివాడికీ స్వంతం కావాలి!

ప్రతి వ్యక్తీ స్వతంత్రంగా బ్రతగ్గలగాలి! ఏ ఒక్కరూ మరొకరి మోచేతి నీళ్ళు త్రాగుతూ ఊడిగం చేయాల్సిన అవసరం ఉండకూడదు!

కష్టం ఒకడిదీ, ఫలితం వేరొకడిదీ కాకూడదు!

అందుకు కావలసింది — భావచైతన్యం! ఈ చైతన్యం కలగాలంటే — కనీస జ్ఞానం కావాలి! దానికి ప్రతివానికీ చదువు కావాలి! అర్థం చేసుకునే శక్తి పెరగాలి!"

ఆర్థికంగానూ, వైజ్ఞానికంగానూ కూడా వెనుకబడి ఉన్న మన దేశంలో — ఈ అలజడి గొనాటిది కాదు!

దాదాపు 1941 నాటికే అతి తీవ్రంగా ఉండేది శ్రీనివాసరావు ఆనాటివాడు అభ్యుదయ వాది

అతనికి గురువులాంటివాడు - తోటి విద్యార్థి, వెంకటరత్నం

వెంకటరత్నం — ఆనాడు, ఆ పరిస్థితుల్లో - ఒక పులిపిల్ల లాంటివాడు

పెరుగుతూన్న అతని మదిలో అభ్యుదయ భావాలు కూడా 'ఇంతింతై వటుడింతై'నంటూ పెరుగుతూండేవి అతనిలోని ఆ మానసిక వికాసం దిన దినాభివృద్ధి చెందుతూండేది

వయసులో చిన్న వాడయినా, గుండెబలం కల వెంకటరత్నం ఆ పార్టీలో గట్టివాడుగా పేరు తెచ్చుకున్నాడు

విద్యార్థి దశలోనే ఉన్నాకూడా పెద్ద పెద్ద నాయకులతో కలిసి తిరుగుతూ, వాళ్ళ చర్చల్లో పాల్గొంటూ — తనకూ అంటూ ఓ స్థానాన్ని సంపాదించుకున్నాడు

అలాగని ఎన్నడూ చదువుపై అశ్రద్ధ చేయలేదు అతడు వ్రాసే జవాబుల్లో కూడా ఏ కాస్త సందర్భం

వచ్చినా వ్యక్తి స్వాతంత్ర్యంమీదా, సర్వ మానవ సమానత్వంమీదా పేజీలకు పేజీలు వ్రాసి పడేసేవాడు

వెంకటరత్నానికీ, శ్రీనివాసరావుకీ చాలా విచిత్రంగా పరిచయమయింది ఆ తర్వాత ఒండొరుల భావాలు అర్థం చేసుకుని చాలా త్వరగా కలిసిపోయారు

మీటింగు అయిపోయింది రాత్రి ఎనిమిది గంటలవుతున్నది

సామాన్యంగా మీటింగు అయ్యేసరికి ఒక్కోసారి రాత్రి ఏ రెండో, మూడో దాటిపోయేది కాని, ఈరోజు ఉపన్యాసకులకు గుంటూరులో మళ్ళీ ప్రోగ్రాం ఉండటంతో త్వరగా ముగించారు

వెంకటరత్నం, శ్రీనివాసరావూ, ఇంకా కొంత మంది సహచరులూ కలిసి గుంటూరు కూడా బయలుదేరారు ఆ సమయంలో — ఎలా వచ్చిందో, ఏమోగానీ సడెన్‌గా అన్నకూతురి పెళ్ళి జ్ఞాపకం వచ్చింది శ్రీనివాసరావుకి అంతే! చరచరా నడుస్తూన్న అతని కాళ్ళు సడెన్ బ్రేకు వేసినట్లుగా ఆగిపోయాయి

నాయకులతోకలిసి మాట్లాడుతూ నడుస్తూన్న వెంకటరత్నాన్ని ఎలా పిలవాలో తెలియక కాస్త తికమకపడ్డాడు అదే సమయంలో ఎందుకో వెనక్కు తిరిగి చూసిన వెంకట్ దూరంగా ఆలోచనగా నిలబడిపోయిన శ్రీనివాసరావుని చూసి ఆశ్చర్యపోయాడు

'మీరు నడుస్తూండండి నేనిపుడే వస్తాను'' అని వాళ్ళతో చెప్పి వెనక్కు వచ్చాడు

అప్పటికప్పుడు ఇద్దరూ కలిసి ఇంకో పది నిమిషాలలో బయలుదేరబోయే రైలుబండి కోసంగా ఆదరాబాదరా స్టేషనుకు పరుగెత్తుకొచ్చారు

వెంకటరత్నానిది 'మాజెల్ల' బెజవాడకూ బందరుకూ మధ్యలో ఉన్నది మాజెల్ల

మాజెల్లలో దిగిపోతానన్న వెంకటరత్నాన్ని ఒక విధంగా బాగా బలవంతంచేసి మరీ బందరుకు తీసుకొచ్చాడు శ్రీనివాసరావు

## తా ర

వీళ్ళు ఇంటికి చేరుకునేసరికి రాత్రి పదిన్నర అయిపోయింది ఒంటిగంటా పది నిమిషాలకు ముహూర్తం!

బంధువులూ, మగపెళ్ళివారూ, ఊరిలోని పెద్దపెద్దవాళ్ళూ — అందరి భోజనాలు అయ్యాయి!

పందిరికి కాస్త అవతలగా గూడెంవాళ్ళకూ, కూలీలకూ భోజనాలు పెడుతున్నారు

''ఏరా! ఇపుడా వచ్చేది?''

అన్నగారి ప్రశ్నకు నవ్వాడేగానీ జవాబివ్వలేదు వెంకటరత్నాన్ని తీసుకొని దొడ్లోకి వెళ్ళి బావిదగ్గర కాళ్ళూ చేతులూ కడుక్కొని వెనుకనుంచీ, నాడిపొయ్యిల ప్రక్కనుంచీ వంటగది దగ్గరకు వెళ్ళాడు

ఒదిన సన్నసన్నగా పెడుతూన్న చివాట్లు చిరునవ్వుతో వింటూ తన స్నేహితుడ్ని పరిచయం చేసాడు.

''ఆకలేస్తోంది ఒదినా!''

''అయ్యో! నా మతి మండిపోనూ! రా! రా!— వడ్డించేస్తాను''

వంటగది ముందర ఉన్న వరండాలో పీటలు వేసి వెండి కంచాలు పెట్టింది

వెంకటరత్నం అభ్యంతరం చెప్పాడు — ''అక్కడ ఎలాగూ వడ్డన జరుగుతూన్నది కదా! మళ్ళీ ఇక్కడెందుకు? అక్కడే తిందాం!''

పులిహోర, రవ్వకేసరి చెరోచేత్తో తెస్తూన్న ఆమె వెంకటరత్నం మాటలకు చివ్వున తలెత్తి మరిది ముఖంలోకి చూసింది

'అతడూ 'నీ జాతి' వాడేకదూ?' అని అడుగుతూన్నట్లుగా ఉన్న ఒదిన చూపులకు కాస్త ఖంగుతిన్నాడు శ్రీనివాసరావు

''ఇవ్వాళ్టికి వద్దులే వెంకట్ ఇంతమంది లోనూ మనం చర్చనీయాంశం అవటం మంచిది కాదు''

వెంకటరత్నం చూపులు బాణాల్లాగా గుచ్చుకుంటున్నాయి

'మనం మనంకూడా చెప్పటానికే కానీ, చేయటానికి ధైర్యంలేని వాజమ్మలుగా నిలబడదామా?' అని అడుగుతున్నాయి — ఆ కళ్ళు

ఆ చూపులు భరించలేనట్లు తలవాల్చుకుని ఒక్క సెకనుసేపు కళ్ళు మూసుకుని ఒక బరువైన నిట్టూర్పు విడిచాడు

అన్నం తింటూనే స్నేహితునికి సంజాయిషీ చెప్పుకున్నాడు — ''అసలు ఏమీ తెలియనివాళ్ళకూ చెప్పవచ్చు! బాగా తెలిసినవాళ్ళకూ చెప్పవచ్చు! గానీ, తెలిసీ తెలియకుండా — 'మాకంతా తెలుసు' అనుకునే ఇలాటివాళ్ళకు మనం చెప్పలేం! ఇంటి నిండా బంధువులున్నారు! రకరకాలుగా విమర్శలు లేస్తాయి! దానికికూడా నేను భయపడను! కాని, ప్రశాంతంగా జరగాల్సిన పెళ్ళిలో — మనం ఏదో చేసినట్లుగా పదిమందీ అనటమూ, గొడవ జరగటమూ — అసలేమీ కారణం లేనిదానికి ఇంతై, అంతై అన్నట్లుగా — పెద్ద రభసచేసి — పెళ్ళిలో అదొక తతంగంలా — ఛా! పైగా దానికి కారణంగా మనం నిలబడాల్సి రావటం - ఇదంతా నా కిష్టం లేదు''

అసంతృప్తిగానే భోజనం పూర్తిచేసారు శ్రీనివాసరావు లోపలకు వెళ్ళి పెళ్ళికూతుర్ని పలకరించి వచ్చాడు

ముందర వైపుకు వచ్చారు

ఆరుబయట తాటి ఆకులతో వేసిన పందిరి క్రింద పెళ్ళి మంటపం ఏర్పాటు చేస్తున్నారు

పెళ్ళి పీటలు, కలశం, పసుపు బట్టలూ అన్నీ అమరుస్తున్నారు పురోహితులు

పెట్రొమాక్సు లైట్లు రాత్రిని పగలుగా నిలబెట్టటానికి వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నాయి

పందిరి నిండుగా చిన్నపిల్లలు అటూ ఇటూ గంతులేస్తూ ఆడుతున్నారు అంతరాత్రి అయినా కూడా ఆ సందడిలో వాళ్ళు నిద్రమాటే మరచిపోయారు లాగుంది

భజంత్రీలవాళ్ళు ఒక మూలగా కూర్చుని వాయిద్యాలు సరిచేసుకుంటున్నారు

అక్కడక్కడా ముసలివాళ్ళూ, యువకులూ, ఆడవాళ్ళూ గుంపులు గుంపులుగా, గ్రూపులుగాచేరి కబుర్లు చెప్పుకుంటున్నారు

శ్రీనివాసరావు ఎవరెవరినో పలకరించి మాట్లాడుతున్నాడు

''ప్రసాదు దగ్గరకు వెళ్దామా?''

ఇద్దరూ కలిసి వీడిదికి బయలుదేరారు పందిరి దాటి గేటు బయటకు వచ్చారు రెండిళ్ళ కవతలగా ఉన్న ఎదురిల్లే విడిది

బయట అరుగుల నిండా మగవారు కూర్చుని ఉన్నారు

లోపలకు వెళ్ళారు

ఏవో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తూన్న వాళ్ళు వెనుకనుండీ శ్రీనివాసరావుని ఎవరో పిలవటంతో ఆగిపోయారు

''ఇప్పుడే వస్తానుండు'' వెనక్కు వెళ్ళాడు



# చెల్లు!

## (గజల్)

### డాక్టర్ దాశరథి

దివ్వెలు వెలిగించగానె మసకలు చెల్లు!
నవ్వులు పొలికించగా అలకలు చెల్లు!

కాలం గడిచినకొద్దీ ఆలు పాతబడుతుండి
వయసు దాటిపోగానే వలపులు చెల్లు!

అతి పరిచయమైనప్పుడు అలుసవుతుంది
అగుపించిన నాడు పలుకరింపులు చెల్లు!

మలయ పర్వతాన భిల్ల వనితల్లాగా
స్నేహ చందనం కొయ్య పొయిలో చెల్లు!

పరిచయమధికముకాగా చులకన కాదా?
చిరకాలపు అనురాగం తృటిలో చెల్లు!

బెట్టు చూపుతున్న చెలియ వెంట పడకుమా!
పట్టనట్టు నటించితే బింకం చెల్లు!

అంది అందనట్టుంటే అనురాగాలు,
అనుక్షణం చెంతవుంటే అంతా చెల్లు!

---

దేన్ని గురించో ఆలోచిస్తూ, అటూ ఇటూ చూస్తూ పరధ్యానంగా నడుస్తూన్న వెంకటరత్నం చటుక్కున కాలు జారిపోవటంతో నిలదొక్కుకోవటానికి ప్రయత్నం చేశాడు ఆ ప్రయత్నంలో ప్రక్కగా పోతూన్న వ్యక్తిని సడెన్‌గా, గట్టిగా గుచ్చి పట్టుకున్నాడు అంతా ఒక్క సెకనులో చిత్రంగా జరిగిపోయింది

ఆ వ్యక్తి గనుక ఆ సమయంలో అటు రాకపోతే తను ఖచ్చితంగా క్రిందపడిపోయేవాడే! ఆ పడటంలో ప్రక్కగా ఉన్న గోడకు కొట్టుకుని ఉండేవాడు

ఏ కాలో, చెయ్యో బెణకటమో, విరగటమో జరగకుండా, కేవలం తనను నిలబెట్టటానికే వచ్చినట్లుగా వచ్చి తనకు ఆధారమయిన ఆ వ్యక్తి వైపు కృతజ్ఞతగా చూశాడు వెంకట్

ఆశ్చర్యం!

ఎదురుగా ఉన్నది - ఒక అపరంజి!

కాలంకాని కాలంలో అనుకోకుండా అందంగా విరిసిన హరివిల్లుని చూసినంత సంబరంగా ఆ వ్యక్తిపై చూపులు నిల్పాడు వెంకట్

పెట్రొమాక్సు లైటు కాంతిలో స్పష్టంగా కనిపిస్తూన్న ఆ సౌందర్యాన్ని నిస్సంకోచంగా చూశాడు వెంకట్

మబ్బు లేనిన ఆకాశంలో తళుక్కున మెరిసే మెరుపు తునకలాంటి తనూలత!

ఆశ్చర్యంతోనూ, భయంతోనూ, అర్థంకాని కలవరపాటుతోనూ చూస్తూన్న పెద్ద కళ్ళు! ప్రపంచంలోని ఆకర్షణ అంతా ఆ కళ్ళల్లోనే ఉంది సుమా అన్పించుతున్నాయి!

సంపంగి నునుపుదనాన్ని పుణికి పుచ్చుకున్న ముక్కుకొన సిగ్గుతోకాబోలు కొద్దిగా ఎర్రబడి అద్భుతమైన అందాన్ని ఇందిస్తూన్నాది!

దానిమ్మ పూవు రంగులో కొద్దిగా వణుకుతూన్నట్లుగా అదురుతూన్న పెదవులూ, ఆ క్రింద—పట్టుకుంటే నురక అవుతుందేమో అన్నంత సున్నితంగా, అందంగా ఉన్న చిన్న గడ్డమూ —

రాజకీయాలతోటి మాత్రమే నిండివుండే అతని మానసం కూడా ఒక్క క్షణం కలవరపాటుకు లోనయింది!

రవివర్మ అపూర్వ కల్పనకు ప్రాణం వచ్చి ఎట్టెదుట నిలబడినట్లుగా ఉన్నాది!

అలా చూస్తూన్న వెంకట్‌కు అది మర్యాద కాదనికానీ, సభ్యత అన్పించుకోదనిగానీ, తప్పు అనిగానీ — ఏమీ అన్పించలేదు అసలలాటి మర్యాద లేవీ జ్ఞాపకానికే రాలేదు!

కేవలం — 'తన ఎదురుగా నిలబడిన ఆ 'సౌందర్యం' మాత్రమే నిజం! మిగిలిందంతా మిథ్య' అన్నట్లుగా చూసాడు

ఓహ్!

'ఎంత బాగున్నాడు!'

సన్నగా, పొడవుగా —

అబ్బ! ఎంత పొడవో! పచ్చని అతని నుదుటిపైన నిర్లక్ష్యంగా కదులుతూన్న ఆ ఉంగరాల జుట్టు నల్లగా ఎంత అందంగా ఉన్నాది!

అతను పట్టుకున్నపుడు తన శరీరంలో కలిగిన వింత అనుభూతిని ఏమంటారో!

అతని కళ్ళల్లో కన్పిస్తూన్న అయస్కాంత శక్తి, లతవి పెదవులపై దోబూచులాడుతూన్న మధురమైన మందహాసం - ఆమెని నిలవనీకుండా చేసాయి

పరుగెత్తి లోపలకు వెళ్ళిపోయింది!

ఆమె ఎరుగిడుతూంటే వెనకాల అటూ ఇటూ ఊగుతూన్న నల్లని పొడవాటి జడను చూసాక వెంకటరత్నం అనుకున్నాడు – 'జడకు కూడా ఇంత సొగసు ఉంటుంది కాబోలు' అని

కాలేజీలో లెక్చరర్లు చెప్పే పాఠాలూ, వేదికలపై నాయకులు చెప్పే ఉపన్యాసాలూ తప్ప — అతని మనసులో మరింకేదీ చోటు చేసుకోలేనిది — ఈ క్షణంలో ఏదో తెలియని దివ్యానుభూతి ఆవరించుకుని అతని శరీరంలోని అణువణువుకూ జంజరా ప్రాకుతున్నాది!

నూనూగు మీసాలతో ఉన్న వెంకటరత్నం మనస్సులో చిరువలపు తొలకరిజల్లు పన్నీరులా చిలకరించింది!

'ఇంత గొప్ప అనుభవాన్ని అందించినది ఎవరో?!' అని క్రిందికి చూసాడు వెంకటరత్నం

'అరటిపండు తోలు!'

బహుశా ఎవరో పిల్లలు పండు తిని, తెలియక తోలుని ఇక్కడ పడవేసి ఉంటారు

ఇంకో సమయంలో అయితే చిరాకు కలిగేదేమో కానీ – ఇపుడు మాత్రం దాన్ని చాలా అపురూపంగా చూశాడు

ఎడమచేత్తో ఎత్తి గోడవారగా వేస్తూ గొణిగినట్లుగా అన్నాడు, "థాంక్‌యూ! థ్యాంక్‌యూ!"

* * *

శ్రీనివాసరావు వచ్చాక లతనితో కలిసి ప్రసాదు దగ్గరకు వెళ్ళాడు.

కొంచెంసేపు సరదాగా కబుర్లు చెప్పుకున్నారు ఇంక ముహూర్తం టైము దగ్గర పడుతోందనగా లేచి గది బయటకు వచ్చారు

తలంబ్రాల బియ్యం ఉన్న పెద్ద ఇత్తడి పళ్ళెం పట్టుకుని ఎదురుగా వస్తూన్న అమ్మాయిని చూసి చటుక్కున ఆగిపోయాడు వెంకటరత్నం

ఆ అమ్మాయి తమను దాటుకుంటూ వెళ్ళిపోయాక, శ్రీనివాసరావుని అడిగాడు –

"వాసూ! ఆ అమ్మాయిని చూడు!"

"ఏ అమ్మాయిని?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు

"అదిగో! గదిలోకి వెళ్తోంది చూడు! ఆకుపచ్చరంగు పావడా కట్టుకుని — ఆ అమ్మాయి! ఆ అమ్మాయెవరో నీకు తెలుసా?"

'ఉన్నట్లుండి బ్రిటిష్‌వాళ్ళు ఇండియా వదలి వెళ్ళిపోయారట!' అని విన్నంతగా ఆశ్చర్యపోయాడు శ్రీనివాసరావు.

'వెంకటరత్నం ఒక అమ్మాయిని గూర్చి మాట్లాడటమూ, అంతేగాకుండా ఆ అమ్మాయి ధరించిన బట్టల రంగును కూడా గుర్తుంచుకుని మాట్లాడటమూ, ఆ అమ్మాయిపట్ల 'ఎవరో!' అని తెలుసుకోవటానికి అతను చూపిస్తూన్న కుతూహలం గమనించి — శ్రీనివాసరావు అమితంగా ఆశ్చర్యపోయాడు

"ఉహూఁ — ఎవరో నాకూ తెలియదు" ఆశ్చర్యంలోంచి తేరుకుని అన్నాడు

**(ఇంకా వుంది)**

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

### సి హెచ్ ఎస్ - నిడదవోలు

ఈ రోజుల్లో ప్రతి మగాడికి ఇద్దరు భార్యలు ఉండడం ఫాషన్ అయిపోయింది చేసుకున్నదాని కంటే వుంచుకున్నదాన్ని ప్రేమగా చూస్తాడెందుచేత?

★ బాగుంది చిట్టితల్లీ కట్టుకున్నది పెళ్లాం అంటే కళ్లెం చేసుకున్నది ప్రియురాలు ఆమెగార్ని తుమ్మితే వూడిపోయే ముక్కులాగా చూసుకోకపోతే— ఎగిరి ఇంకో కొమ్మ చూసుకుంటుందని భయం !!

### వనిత - ఆదోని

రచయితపై మోజుపడి, చివరకతను కాదన్నందుకు ఆత్మహత్యకు పాల్పడిన

★ సారీ, పిరికివాళ్లని నేను భరించలేను అయినా — వ్యామోహాలు ప్రేమలనీ, వ్యవహారాలు ప్రేమలనీ అనుకునేటంత పసితనంలో ఆడపిల్లలు వుండడం ప్రవర్తించడం — చాలా సిగ్గుచేటు ఇష్టమైతే ప్రేమ అనుకోడమేనా ? వయసుపిల్లలు దొంగచాటు కలాపాలు సాగించడంలో అర్థం వుందా ? స్నేహాన్ని కాస్త పెరిగితే ప్రేమగా అంచనా కట్టడంతో వస్తాయి అసలు చిక్కులు

### కృష్ణ - నరసారావుపేట

కె రా గారూ, మీరు మరీ మూర్ఖంగా ఆడవాళ్లను వెనకేసుకు వస్తారు అంటున్నాడు నా ఫ్రెండు

★ నిజమే ఏం మీ అభ్యంతరమా ?!

### శేఖర్ - అనంతపురం

స్త్రీ ఒకరిని ప్రేమించి, ఇంకొకరితో కాలం గడపకలేదు కాని పురుషుడు అట్లా మలభంగా చేయలేడు - అని ఒక మహా రచయిత అంటాడు ?

★ పురుషుని ప్రేమలో స్వార్థచింతన ఎక్కువ వుండడమే కారణం

ఆత్మ జ్ఞానంవల్ల మోక్షం ప్రాప్తిస్తుందని భగద్గీత అంటూంది మీరు ?

★ మోక్షం సంగతి — చచ్చిన తరువాత గోల కాస్త లోకజ్ఞానం ప్రసాదించే దారి చూసుకుంటే - ఇహం సుఖంగా సాగిపోతుందంటాను

### ఎస్. బి హెచ్ ఎల్. - హైదరాబాదు

మా చెల్లెలి పెళ్ళి యీ మధ్య అయింది ఒక నెల అత్తవారింట బాగానే వుంది

★ మీ లేఖ చదివాను ఈ విధంగా కాలయాపన చేయడం కాదు మీ కుటుంబ వైద్యుని సంప్రదించాలి తరువాత ఏ జయానాగరాజా వంటి మానసిక వైద్యురాలినో కలిసి మీ అనుమానాలు చెప్పి ఆలోచన చెప్పమనాలి మీరీ శతాబ్దిలో బ్రతుకుతూ, గాలీ ధూళీ దెయ్యాలనడం సిగ్గుచేటు పాపం దెయ్యం అని భూతవైద్యాల పాలు చేసే చాలామంది కన్నెల రోగం ఏ హిస్టీరియానో అయివుంటుందని కాస్త లోకం తెలిసిన వాళ్లెవరేనా చెప్తారు

### జి. ఎస్ బి. — ఖరగ్‌పూరు

పదిమందిచేత ఛీ అనబడే వ్యక్తి యీ లోకంలో బ్రతకాలని అంటారా అక్కయ్యా ?

★ పదిమంది ఛీ అంటే పాతికమంది జై కొట్టేవాళ్లు తప్పకుండా వుండేవుంటారు చెల్లెలా అంచేత బాధపడకూడదు

### చంద్రశేఖర్ — కె జి. ఎఫ్

జనాభా లెక్కల ప్రకారం ప్రతి వెయ్యిమంది మగవారికి అరవై ఎనిమిదిమంది ఆడవారు తక్కువ వుండికూడ ఎందుకీ తక్కువతనం ?

★ అర్థంకాలేదా ? సెంక్షన్ !! ఎలిజిబిలిటీ లనేది ఒకటి వుంటుందికదా ప్రతి ఆడపిల్లా కొద్దోగొప్పో వివాహ యోగ్యత కల్గివుంటుంది కాని ప్రతి అబ్బాయీ అలాకాదే !! భార్యను పోషించకలచేవ కల్గివుండాలికదా ?

### ఎల్ వి ఆర్ — పెడన

ఎంత చదువు చదివినా నిరుద్యోగం పెరిగిపోతున్న యీ రోజుల్లో వరకట్నం తీసుకోవడం పురుషునికి గొప్ప ధైర్యాన్నిస్తుంది ఆ డబ్బుతో

★ డబ్బుకోసం పెళ్లి చేసుకుంటారు సుఖం కోసం సంసారం చేస్తారు పెద్దల కోసం పిల్లల్ని కంటారు మరి భార్యని పోషించడం కోసం ? — ఆమె కట్నం డబ్బు పెట్టుబడి పెడతారా ?! చూడండి సంపాదన అన్నది "ఆత్మ ధైర్యాన్ని ఇవ్వడానికే కాదు, ఆత్మ గౌరవం కాపాడుకొందుకు కూడ చాలా అవసరం సంపాదన ప్రారంభించకుండా పెళ్లిమాట తలపెట్టకూడదు

### బి ఎస్ ఆర్ - బొబ్బిలి

నేనో అమ్మాయిని ప్రేమించాను ఆమె నన్ను ప్రేమించింది కాని ఆ అమ్మాయి పరిస్థితులప్రభావం వల్ల మరో అబ్బాయితో పరిచయం అయి, అతన్ని ప్రేమించింది కాని ఆ అబ్బాయి నిజరూపం తెలుసుకుంది ఇప్పుడు నన్ను కావాలంటూంది ?

★ గొప్పచిక్కువచ్చిపడిందయ్యా శ్రీనివాసరావు! ఇక మీ నిజరూపం తెలిశాక ఆ అమ్మాయి ఏం చేస్తుందా — అన్నది అసలు కథ మీ ప్రాంతం షూటింగుకి వస్తారు ప్రొడ్యూసర్లు చెప్పి చూడండి కథ !

### జి. జె ఆర్ విశాఖపట్నం

రాత్రే జీవనజ్యోతి చూశాను . వాణిశ్రీగారికి పాదాభివందనం చేయాలి అంత చక్కని కథను రాసినందుకు మీకూ

★ చాలు చాలు సినిమా విజయవంతం అయితే — మరిచిపోయేది రచయితనేనని తెలియదా మీకు ?! విజయవంతమైన సినిమాకి - కథ రాయింపిస్తారు ! తీయింపిస్తారు ! అదే పరాజయం పొందితే — రాస్తారు ! తీస్తారు !! అంచేత ఒక విజయం వల్ల మనకి ఒరిగేదీలేదు, తరిగేదీలేదు అయితే ఒక్కటి ఆ చిత్రానికి పనిచేసిన యూనిట్ ఘనత మాత్రమే అది ఎప్పుడూ వాణిశ్రీ నా అభిమాన నటి

1981 వ సంవత్సరానికి రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డునందుకున్న డా వెంపటి చినసత్యం, డా నేరెళ్ల వేణుమాధవ్‌లలో శ్రీ పి వి రమణయ్య దంపతులని చిత్రంలో చూడవచ్చు



# పెళ్ళిచూపులు

గుమ్మా ప్రసాదరావు



''నాన్నా! ఈ పెళ్ళిచూపులకు సంసిద్ధంగా లేను అసలు ఈ వివాహ వ్యవస్థమీదే నాకు నమ్మకంలేకుండా పోయింది'' అంది అనూరాధ ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి

సత్యనారాయణ కూతురికేమని చెప్పాలా అన్న ఆలోచనలో పడిపోయాడు అనూరాధ స్థితి అతనికి అర్థం కాకపోలేదు తను ప్రతీమారు ఒక సంబంధం తీసుకురావడం, పెళ్ళిచూపులు అనే పేరుతో అర్థంలేని ప్రశ్నలు వేసి విసిగించి చివరకు పిల్ల నచ్చలేదనో, కట్నం చాలదనో పెదవి విరిచేయడం

అనూరాధ అనాకారి కాదు అయితే పాలరాతి విగ్రహంలాగుండదు చామనఛాయ, దేముడిచ్చిన రంగుకి ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు ? ముఖ్యంగా ఆమె నచ్చకపోవడానికి ఆమె రూపం కారణంకాదు; తను ఇవ్వలేని కట్నం బడిపంతులు ఉద్యోగం చేస్తున్న తను వారు ఆశించే పది—పదిహేను వేలు కట్నం ఎక్కడనుంచి తేగలడు ? రోజురోజుకి ఎదుగుతున్న కూతుర్ని ఎంతకాలం ఉంచుకుంటాడు—గుండెలమీద కుంపటిలా ? ?

''అదేమిటే ? — పెళ్ళివారు ఇంటికి వచ్చే సమయం అవుతూవుంటే ఇప్పుడు ఈధోరణేమిటి?'' అంది పార్వతి

ప్రతీమారు ఈ సంబంధం ఖాయం అవుతుందని ఆమె ఆశపడడం — నిరాశ ఎదురవడం ఆమెకు మామూలే

''అమ్మా! పెళ్ళి అంటే నాకు విముఖతలేదు అయితే ఈ పరిస్థితులలో నాకు పెళ్ళి అవుతుందన్న ఆశలేదు పెళ్ళికొడుకులు కొండెక్కి కూర్చుంటున్నారు వారిని కిందకు దింపే తాహతు మనకులేదు రోజురోజుకి కట్నాలదాహం ప్రబలిపోతూన్నది అనవసరంగా ఈ ఏర్పాట్లకు పాతికో ముప్ఫయ్యో ఖర్చుచేయడం దండగ''

''అనూ! ఏ వ్యవస్థలోనైనా మంచితోపాటు చెడూవుంటుంది వివాహం అంటే నూరేళ్ళపంట కాబోయే భార్యాభర్తలు ఒకరినొకరు చూసుకోవడం—నచ్చుకోవడం అవసరం కాదంటావా ? ఈ ఆచారం అనాదిగా వస్తున్నది లోగడ కొన్నిసంబంధాలు కట్నాల దగ్గర పొంతన కుదరక తప్పిపోయాయి అయితే అది మనసులో వుంచుకొని పెళ్ళిచూపులే నిరర్థకం అంటావా ? అందరూ కట్నాలను ఆశించే వారే అంటావా ?'' అంది పార్వతి

''అమ్మా! మార్జాల కబళ న్యాయం అంటే ఇదే! ప్రతీమారు నీవు ఇదేవిధంగా ఆశపడి మోసపోతున్నావు నీవు వూహించేటటువంటి సహృదయులు వుంటారంటే నాకు నమ్మకంలేదు'' అంది అనూరాధ

''అనూ! మధ్యతరగతి కుటుంబాలకు ఈ బాధ తప్పదు బడిపంతులు కడుపున పుట్టిన నీకు ఈవ్యధ తప్పదు ఇష్టంలేదని తెలిసినా నా ఆరాటంకొద్దీ వారిని రమ్మనమని ఆహ్వానించాను వస్తున్నారు ఇంటికి పిలిపించి అవమానం చేసారన్న అపకీర్తి నాకు రానివ్వకు'' అన్నాడు సత్యనారాయణ కుమార్తెను బ్రతిమాలుతూ

''నాన్నా! నీకు అవమానం కలిగేపని నేను చెయ్యను అయితే నీవు నాకో మాటివ్వాలి''

''అర్థమైంది తల్లీ! ఈ సంబంధం కుదరకపోతే మళ్ళీ పెళ్ళిచూపుల ప్రస్తావన తేను నీవు నీ కాళ్ళమీద నిలబడి పరువుగా వుద్యోగం చేసుకుందువుగాని, నేను కాదనను''

అనూరాధ వెళ్ళిపోయింది

పార్వతి భర్తవంక ఆందోళనగా చూసింది

''ఈ సంబంధం తప్పిపోతేమరి 'అనూ'కి పెళ్ళి చేయరా ?'' అంది

''పార్వతీ! వాళ్ళు వచ్చేసమయం అవుతున్నాది మరేం దిగులు పెట్టుకోకు అమ్మాయి ముస్తాబు విషయంచూడు'' అన్నాడు సత్యనారాయణ భార్యకైతే దిగులు పెట్టుకోవద్దని చెప్పాడు కాని తాను దిగులుచెందకుండా వుండలేకపోయాడు

కట్నాలసమస్య ఇంతిగా విషమించుకుపోవాలా? ఈ ఆచారవ్యవహారాలను పెద్దలు ఏ దృష్టితో పెట్టారు ? కాని నేడు వ్యాపార దృక్పథం తప్పించి మరో దృక్పథం కనిపిస్తున్నాదా ? ఆడపిల్ల పెళ్ళి అంటే ఆనందంకన్నా దుఃఖమే అధికమా ? తనూ కట్నం తీసుకున్నాడు ఆ రోజుల్లో రెండువేల నూటపదహార్లు ఆనాటి రూపాయి విలువ ప్రకారం అది తక్కువకాదు అంత కట్నం ఇవ్వలేని ఒకటి రెండు సంబంధాలను తనూ తృణీకరించాడు అందుకా నేడు తనకీ పరీక్ష? తను నేరం చేసి వుంటే తన కూతురికా శిక్ష ? అనూలో ఏ లోపం వుంది ?

* * *

''సత్యం! కట్నం ఇవ్వలేనని భయపడి అమ్మాయికి పెళ్ళి సంబంధాలే చూడడం మాని వేస్తావా ? చూడు సత్యం! మనుష్యులందరూ ఒకేలాగుంటారని భావించటం సబబుకాదు విశ్వనాథంగారని నాకు తెలిసినాయన ఢిల్లీలో వున్నరు వారి అబ్బాయి బి టెక్ పాసై టెలిఫోన్సులో పనిచేస్తున్నాడు మీ అమ్మాయి విషయం చెప్పాను అమ్మాయి నచ్చితే చేసుకుంటాం అన్నారు నా మాట విని వారికో ఉత్తరం ముక్క

పడేయి, పెళ్ళిచూపులకు రమ్మనమని'' అన్నాడు సత్యనారాయణ స్నేహితుడు గోపాలం

''గోపాలం! నీకు తెలియందేముంది ఎక్కువగా కట్నం ఇచ్చుకునే స్థితిలోలేను అబ్బాయి బి కెక్ అంటున్నావు మరి వనకు అందుబాటులో వుంటారా? అసలే అమ్మాయి పెళ్ళిచూపులంటే ముఖత చూపుతున్నాది అందరాని పళ్ళకెందుకు? మనం హైరానా పడటం మిగులుతుంది తీరా కట్నం దగ్గర బెడిసికొడితే అమ్మాయి బాధపడు తుంది'' అన్నాడు సత్యనారాయణ

''కట్నం కోరరని నేనను అయితే కట్నమే ముఖ్యం అనుకునేవాళ్ళు కారు మన అనూరాధ అదృష్టం బాగుంటే కుదరవచ్చునుగా? మరో మాట చెప్పక వెంటనే వుత్తరం రాయి ఇదిగో ఎడ్రసు'' అన్నాడు గోపాలం

సత్యనారాయణ వారికి వుత్తరం రాయడం, అటునుంచి జవాబు రావడం అయింది

ఈరోజే వస్తున్నారు వారిని తీసుకురావడానికి గోపాలం స్టేషనుకి వెళ్ళాడు

* * *

గేటుముందు రెండు రిక్షాలు ఆగడం గమనించి ''పార్వతీ! వాళ్ళు వచ్చినట్లున్నారు'' అని అంటూ వీధిలోనికి వెళ్ళాడు సత్యనారాయణ

''ఇతడే సత్యనారాయణ నా మిత్రుడు మీరు చూడబోయే అనూరాధ తండ్రి ఒరేయ్ సత్యం! ఈమె విశ్వనాథంగారి భార్య సుబ్బలక్ష్మిగారు ఇతను విజయ్ వారి అబ్బాయి'' అంటూ పరిచయాలు పూర్తిచేసాడు గోపాలం

''విశ్వనాథంగారు రాలేదా?'' అన్నాడు సత్యనారాయణ

''వారికి క్షణం తీరికవుండదు పిల్లను చూసుకోవలసింది — నచ్చుకోవలసింది ఇదిగో వీడూ — నేను'' అంది సుబ్బలక్ష్మి

'పిల్లను చూడగానే నచ్చుకోగానే సరిపోతుందా? వ్యవహారం అంతా తర్వాతనేవుంది' అనుకున్నాడు మనసులో సత్యనారాయణ

ఆ తరువాత అందరు గదిలోనికి వెళ్ళారు పార్వతి వచ్చి నమస్కరించింది

''చూడండి! నాదొక్కమనవి మావాడు చెప్పాడోలేదో! నేను బడిపంతుల్ని బడిపంతుళ్ళ స్థితిగతులు మీకు తెలియనికావు విశ్వనాథంగారు కూడా వచ్చివుంటే కట్నకానుకల విషయం కూడా ముచ్చటించుకోవడం జరిగిపోయేది వారు రాలేదు'' అన్నాడు సత్యనారాయణ

''బాగుందండీ! మీరు వ్యవహారం అటునుంచే నడిపేలాగున్నారు బేరసారాలు చేసేది, ముందు పిల్లను చూసినతరువాతకదా? మీరు బడిపంతులు అంటున్నారు ఆ విషయం గోపాలంగారు చెప్పారు లెండి పోతే మా నాన్నాగారుకూడా చేసింది ఆ వుద్యోగమే'' అంది సుబ్బలక్ష్మి

''అలాగా?'' అన్నాడు

''మా నాన్నాగారిపేరు కొండలరావు మాస్టారు బొబ్బిలి దగ్గర పాలేర్రు'' అంది

పాలేర్రు — కొండలరావు మాస్టారు అని వినగానే సత్యనారాయణ గుండెల్లో రైళ్ళు పరుగెట్టాయి గతంలోనికి స్మృతులు పరుగులెట్టాయి

ఎదురుగా కూర్చున్న సుబ్బలక్ష్మి స్థానంలో పరికిణీ వోణీ వేసుకొని సిగ్గుతో ఎరుపెక్కిన బుగ్గలతో ముడుచుకు కూర్చున్న పదహారు సంవత్సరాల పిల్ల కనుపించింది ఔను! ఆ పిల్లను చూసేందుకు తను తల్లిదండ్రితో పాలేర్రు వెళ్ళాడు ఎప్పుడు? పాతిక సంవత్సరాల క్రిందట

''చెల్లెమ్మా! పిల్లను తీసుకురా'' అన్నాడు గోపాలం

తాను ఏ పిల్లను చూసి ఇంటికివెళ్ళి పెళ్ళి చేసుకొందికి నిరాకరించాడో ఆమే ఈ నాడు కొడుకుతో తన కూతుర్ని చూసుకుందికి వచ్చింది లోగడ ఈ సత్యనారాయణే తనను నిరాకరించాడని ఆమెకు తెలుస్తే ఈ సంబంధం కుదురుతుందా?

పార్వతివెళ్ళి కుమార్తెను తీసుకువచ్చింది

''మా అమ్మాయి అనూరాధ మెట్రిక్ పాసైంది కుట్లూ అల్లికలువచ్చు సంగీతంలో కూడా కొంత ప్రవేశముంది'' అంది పార్వతి

''బాగుంది పెళ్ళికూతురికి ఈ అర్హతలన్నీ విధిగా వుండాలి మన రోజులలోనూ ఇవే ఆచారాలు తరంమారినా ఆచారాలు మారలేదు'' అంది నవ్వుతూ సుబలక్ష్మి

సత్యనారాయణకు ఆ మాటవెనుక, ఆ నవ్వు వెనుక ఏదో ఎత్తిపొడుపు వుందనిపించింది 'మన రోజులలోనూ' అంటూ తనవంకే చూసింది అంటే ఆమె తనను గుర్తుపట్టే వుంటుంది 'అమ్మాయికి సంగీతం ఏమైనావచ్చా?' అని ఆనాడు తన తల్లి ప్రశ్నించింది

'పెద్దగా సంగీతంరాదు కచేరీలు చేయలేకున్నా హార్మణీమీద నాలుగు కృతులు వాయించగలదు' అంది సుబ్బలక్ష్మితల్లి తనతల్లి కోరికమీద ఓ పిన్న త్యాగరాయకృతి పాడింది మధురమైన కంఠం సత్యన్నారాయణ కళ్లకు కట్టింది ఆ దృశ్యం

''అదేంకాదు మా అమ్మాయికి వీణ వాయించడంలో మంచి నేర్పువుంది ఇది పెళ్ళిచూపులకని నేర్పించిన విద్యకాదు'' అంది పార్వతి

''సంగీతం ఒక కళ అది అందరికి అబ్బదు కాని ఏమిటో ఈ పెళ్ళిచూపుల కోసం ప్రతీ పిల్లా నాలుగు కీర్తనలు నేర్చుకోవలసినదే! ఆ రోజుల్లో నాకూ మావాళ్ళు అలాగే నేర్పించారు వచ్చీరాని సంగీతం ఎదురుగా ఇంటర్వ్యూ చేసే మనుషులు ఎలా పాడగలం చెప్పండి? ఓ మారు పెళ్ళిచూపుల సందర్భంలో పాడవలసివచ్చింది ఏం పాడేనో — ఏం వాయించేనో? - పెళ్ళి మాత్రం కుదరలేదు సంగీతం రాకకాదు, కట్నం దగ్గర బేరం కుదరక'' అంది సుబ్బలక్ష్మి

ఎప్పటి మాట! సుబ్బలక్ష్మికి ఆనాటి సంగతి ఇంకా గుర్తుంది నిండా పాతిక సంవత్సరాలు గడిచిపోయాయి సంసారయాతనల్లోపడి తను మరచిపోయాడు సుబ్బలక్ష్మి ఇప్పుడా విషయం కాకతాళీయంగా అనివుండదు ఈనాడు తనని అవమానించాలన్న కృతనిశ్చయంతోనే వచ్చింది

''మా సత్యం అనూకి సంగీతం పెళ్ళి కోసం నేర్పించలేదు తల్లీ అనూ! ఒక్క కృతిపాడు'' అన్నాడు గోపాలం

అనూరాధ పాడిన పాట విని ''బాగా పాడావు తల్లీ!'' అంది సుబ్బలక్ష్మి ''అయినా మన మధ్యతరగతి వాళ్ళకు సంగీతం వచ్చినా ఏం ప్రయోజనం వుంది? పెళ్ళి జరిగిన తరువాత సాధనకు అవకాశం ఉంటుందంటారా? మీరే చెప్పండి?'' అంది సుబ్బలక్ష్మి

సత్యనారాయణ శరీరంలో రక్తం గడ్డకట్టుకుపోయింది 'మీరే చెప్పండి' అంది బహుశా తనతోనే ఆనాడు కట్నాల దగ్గర బేరం కుదరలేదు 'పిల్లకు సరిగా సంగీతంకూడా రాదు మావాడు సంగీతం అంటే పడిచస్తాడు' అన్నాడు తండ్రి, సుబ్బలక్ష్మిని చేసుకోకపోవడానికి అసల కారణం అదన్నట్లు అందుకే ఇప్పుడీ ఎదురు సవాలు? 'సత్యనారాయణ గారూ! మీరు సంగీతం అంటే పడిచస్తారుగా? రోజూ సంగీతాన్నే భోజనం చేస్తున్నారా ఈ పాతికేళ్ళనుంచి? ఆ మీరే చెప్పండి' అనేగా అర్థం?!

తనను చిత్రహింస చేయడానికి వచ్చింది

''నీ పేరేమిటమ్మా?''

''అనూరాధ''

''ఎంతవరకు చదువుకున్నావు?''

''మెట్రిక్ పాసయ్యాను''

'టైపునేర్చుకోలేదా?''

'అమ్మాయికి టైపువచ్చా?' అని ఆనాడు నాన్నగారు అడిగారు పాలేర్రులాంటికుగ్రామంలో వుంటున్నపిల్ల ఏలానేర్చుకుంటుంది? ఆ విషయం గుర్తించుకొనే సుబ్బలక్ష్మి ఈ ప్రశ్నవేసింది సత్యనారాయణ అసౌకర్యంగా కుర్చీలో కదిలేడు అసలు వాళ్ళు వచ్చింది పెళ్ళిచూపులకు కాదు, ప్రతీకారం తీర్చుకోడానికి అందుకే పేలవలసిన బాంబు పేలింది

''నేర్చుకోలేదండి'' అంది అనూరాధ

## కన్నీటి వర్షం

నిజాయితీ చంద్రుణ్ణి
అవినీతి మబ్బులు
ఆవరిస్తుంటే,
కుల, మత కలహాల మెరుపులు
కత్తుల్లా
మెరుస్తుంటే,
దగా, మోసాల స్వార్థపు ఉరుములు
గూండాల్లా
ఘర్జిస్తుంటే,
చుక్కలన్నీ
ముఖాలు చాటుచేసుకొంటున్నాయి
రాజకీయ నాయకుల్లా —
ఆకాశం
ఏకధాటిగా కన్నీరు కారుస్తోంది
ప్రస్తుత సమాజంలోని సామాన్యమనిషిలా—

**— గుడిసేవ సుందరరామయ్య**


ఈ రోజు
మంచి రోజనే
భావనలో
మధుర స్వప్నాలేవేవో
మఫత్‌లాల్
బట్టలతో
అనుక్షణం
తీరేను తీయని
కోరికలవేవో.
సరదాగా, సున్నితంగా హాయిని గొల్పేలా
బట్టలు—పాలియెస్టర్, పాలియెస్టర్
బ్లెండ్‌లలోనే గాక కాటన్‌లలో కూడా—
క్షణక్షణం, అనుక్షణం, రోజూ, ప్రతిరోజూ
మిమ్మల్ని మరింత అందంగా రూపొందించ
గల రంగుల్లో, నేతలలో, డిజైన్లలో.
మఫత్‌లాల్
ఫ్యాబ్రిక్స్

రాజాలన్ని ఒక్కలాగే వున్నాయి ఈనాడూ ఆడపిల్లల పెళ్ళిళ్ళు సమస్యగానే మిగిలిపోయింది నా చిన్నతనంలో అంటే ప్రజల్లో చైతన్యంలేదు సాంప్రదాయాలను గుడ్డిగా అనుకరిస్తూ ఎదుటివారిని హీనపరిచేవార విజ్ఞానంలో మానవుడు ఎంతగా పురోగమించినా, స్త్రీలకు పురుషులతో సమంగా అధికారాలూ, హక్కులూ ఉన్నాయని గుర్తించినా, మనుషుల మానవత్వంలో మార్పురాలేదు మావాడికి పాతికవేలు కట్నం ఇస్తాం అంటూ ఒక పెద్దమనిషి సంప్రదింపులకు వచ్చాడు పెళ్ళి చేయవలసింది డబ్బుకాశపడా ? పెళ్ళికూతురు – పెళ్ళికొడుకు పరస్పరం చూసి అంగీకరించుకోవద్దా ? నా పెళ్ళి ఒకమారు ఈ కట్నం దగ్గరే ఆగిపోయింది వచ్చిన పెళ్ళివారు నన్ను చేసుకుందికి అంగీకరించినట్లే కనబడ్డారట తీరా వారు కోరినకట్నం దొరకటంలేదని ఏవో సాకులుచెప్పి పిల్లనచ్చలేదు అన్నారు అసలు కారణం వేరేవుందిలెండి వేరొకరు రెండువేలు ఇస్తాం అన్నారు ఇంకేం ! కుదరవలసిన సంబంధం తప్పిపోయింది '' అంది సుబ్బలక్ష్మి

'సుబ్బలక్ష్మిగారూ ! ఏదో తెలిసో తెలియకో ఆనాడు మిమ్మల్ని చేసుకుందికి నేను నిరాకరించాను అయితే ఆ విషయం ఇలా మనసులో వుంచుకొని ఈనాడు నన్ను చిత్రహింస చేయాలా ? పెళ్ళిళ్ళు స్వర్గంలో జరుగుతాయంటారు కొన్ని పెళ్ళి చూపులు చూపులతోనే నిలిచిపోతాయి అయితే ఆ విషయాన్ని ఇంత రాద్ధాంతంగా చేసి ఈనాడు మీరు కసితీర్చుకోవాలా ? మీరు నన్ను కించపరిచినా బాధపడను జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నాను స్కూలుమాస్టరు ఉద్యోగం చేసుకోవడం— అని అనుకున్నాను చివరకు స్కూలు మాస్టరుగానే స్థిరపడవలసి వచ్చింది మీరెంత కఠినంగా మాట్లాడినా ఆరగించుకోగలిగే శక్తి వుంది కాని అనూరాధ అభం శుభం తెలియనిపిల్ల ఇప్పటికే విసిగిపోయింది చిట్టచివర ప్రయత్నంగా ఈ పెళ్ళిచూపులకంగీకరించింది మీరు ఇలాచూసి హేళనచేసిపోతే దాని బ్రతుకేంకాను ?' అని అడగలనుకున్నాడు సభ్యత అడ్డొచ్చింది

ఆమెనోటికి తాళం పడాలంటే నోటికి పని కల్పించాలి భార్యతో ఫలహారాలు తెమ్మని చెప్పాడు పార్వతి ఫలహారాలు తెచ్చింది

# పెళ్ళి చూపులు

''ఇప్పుడీ ఫలహారాలు ఎందుకండీ ! పన్నెండు గంటలు దాటింది, భోజనాలవేళ '' అంది సుబ్బలక్ష్మి

''ఆనవాయితీకదండీ ! పెళ్ళిచూపులన్న తరువాత ఫలహారాలు పెట్టకపోతే లోకంహర్షించదు లోకంమాట ఎలాగున్నా మీరు మాకు సభ్యతకూడా తెలియదనుకొంటారు'' అంది పార్వతి భర్త ముభావంగా కూర్చున్నాడు

''కొన్ని ఆనవాయితీలు అర్థంలేనివనే అనుకుంటాను ఇప్పుడు ఫలహారాలు మరికొంత సేపుపోతే భోజనాలు ఇది అనవసరపు శ్రమా ఖర్చూకాదా ?''

''                ''

''ఏమిటీ ! మాకు భోజనం పెట్టకుండా ఉత్తి ఫలహారాలతోనే పంపిస్తారా ? మేం ఢిల్లీలో మొన్నరాత్రి రైలెక్కేం ''

''అబ్బే ! అదికాదు మీ భోజనం ఏర్పాట్లు గోపాలం అన్నయ్యగారు చూస్తున్నారు ఇక్కడ నాలుగు విషయాలూ మాట్లాడుకుని, పిల్లను చేసుకుందికి మీరు ఇష్టపడినట్లు ఒక్కముక్క చెప్తే, తరువాత కార్యక్రమం భోజనాలే'' అంది పార్వతి

''అమ్మో ! కాబోయే కోడలి చేతివంట తినాలని ఆశపడి వచ్చాం మాకా అదృష్టం లేదా ?''

''ఈ ఫలహారాలు అమ్మాయి చేసినవే ''

''వదినగారూ ! మాకు ఇక్కడే భోజనం చేయాలని ఉంది మీరు శ్రమ అనుకోకూడదు ''

''చూసారా ! మీరు క్షణంక్రితం శ్రమా ఖర్చూ అన్నారు మీరు ఇక్కడే భోజనం చేయాలనుకుంటే అది శ్రమా ఖర్చూ కాదా ? అక్కడ మా వదిన వండిన పిండివంట లేంకావాలి ?'' అంది పార్వతి

''సుబ్బలక్ష్మిగారు ! అసలు విషయం అదికాదు కతుకుతే అతకదంటారు ఎంతైనా పూర్వులేర్పరిచిన సాంప్రదాయాలు '' అన్నాడు గోపాలం.

సుబ్బలక్ష్మి నవ్వింది సత్యనారాయణ మరింత ముడుచుకుపోయాడు ఏమిటీ వింతధోరణి ?

''సాంప్రదాయం కాదనను అయితే వాటిని గుడ్డిగా ఆచరించడం అర్థంలేదు కతుకుతే అతకదా ? అందుకు ప్రమాణం ఏమిటి ? కతకవంత మాత్రాన అతికిపోతుందా ? పోనీ దానికేవా నిదర్శనం వుందా ? ఈ ఫలహారాలు తిన్నా వీరింటిలో కతికినట్లేగా ? ఇప్పుడు మాత్రం చెడిపికొట్టదా ? అసలు అతకడానికైనా అతక్కపోవడానికైనా వేరే కారణాలుంటాయి ? ఏమంటారు సత్యనారాయణ గారూ ?''

సత్యనారాయణకు తనకింద భూమి బద్దలైనట్లు అనిపించింది నేరుగా తననే అడిగింది వాళ్ళతో వియ్యం జరుగుతుందని ఆశించడం వ్యర్థం

''పార్వతీ ! భోజనం ఏర్పాట్లు చెయ్యి'' అన్నాడు

'అసలు పెళ్ళిచూపుల్లో అవసరమైనవాటిని విస్మరించి అనవసరమైనవాటికి ప్రాధాన్యత ఇస్తున్నారు మనవాళ్ళు'' అంది సుబ్బలక్ష్మి

'అమ్మా ! మీరు రాజధానినగరం ఢిల్లీలో వుంటున్నారు మేం గుట్టుగా పల్లెటూరిలో కాపురం చేస్తున్నాం ఈ సభ్య సమాజంలో ఏవి అవసరమో ఏవి అనవసరమో మాకెలా తెలుస్తాయి ?' సత్యనారాయణ బయటకనలేక మనసులోనే అనుకున్న మాట

''అనూరాధా ! నీకు వంట వాతనౌనని మీ అమ్మగారు అంటున్నారు ఈ పూట నీ చేతి వంట తినాలనివుంది'' అంది సుబ్బలక్ష్మి

అనూరాధ తల్లివంక చూసింది

''చిన్నపిల్ల ! అది ఏం చేస్తుంది ? పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్తే ఎలాగూ తప్పదు '' అంది పార్వతి ఆమెకూ అసహనంగానే వుంది

''అనూరాధా ! ఆవిడకా కోరిక వుంటే అలాగే కానీయ్ చెల్లెమ్మా మధ్య మన అభ్యంతరం ఎందుకు ?'' అన్నాడు గోపాలం

సుబ్బలక్ష్మి ముఖం ప్రసన్నమైంది

''అనూరాధా ! ఇంటిలో కూరలేమైనా వున్నాయా ?''

''ఉన్నాయండీ ! బంగాళాదుంపలు, కాబేజీలు ''

''ఆ కూరలు రోజూ లింటున్నవే దగ్గరలోనే బజారు వుందిగా ? బీరకాయలు తీసుకురా అన్నం, బీరకాయ కూరా, చారూ ఇవి చాలు మరేం హైరానా పడవలసింది లేదు ఇంద ఈ పది రూపాయలు అన్నట్లు వస్తూ కిరాణాకొట్టులో బియ్యం వగైరా కొను'' అంటూ అనూరాధ దగ్గరకొచ్చి ఆమె చేతిలో పది రూపాయలుంచింది సుబ్బలక్ష్మి

''వదినగారూ ! మీరు డబ్బులివ్వాలా ? బియ్యం, చింతపండు వగైరాలు ఎందుకు ? మీ దయవలన వాటికి లోటు లేదు బీరకాయలన్నారు అవి తెచ్చుకోవాలి కూరకోసం అది బజారుకు పోవాలా ? మావారున్నారు, అన్నయ్యగారున్నారు- లేరా ? వారిలో ఒకరు కూరతెచ్చేలోగా అది వంట మొదలెటుతుంది ఏమంటారు ?'' ఎంత రాజధాని నగరంలో వున్నా, ఎంత పెళ్ళికొడుకు తల్లి అయినా ఇంత అధారిటీ చెలాయించాలా ? అన్న అక్కసుతో అంది

సుబ్బలక్ష్మి ఆమె కోరికను చాలా వినోదంగ

కాకినాడలో మంజులా ఆర్ట్సు అకాడెమీవారు తమ 13వ వార్షికోత్సవ సందర్భంగా ప్రదర్శించిన ''భయస్కోప్'' మ్యూజియ్స్ లో ఒక దృశ్యం శ్రీ భద్రం, శ్రీ పాపారావు, శ్రీమతి మణికుమారి, డా దివాకర్, డ మహేష్, యస్సారెడ్డి బాబు, వేణు డా జయరామశర్మలని చిత్రంలో చూడవచ్చు



# ఉత్సాహాభరితం



మీ డబ్బుకు గొప్ప విలువ
మాంఛియర్ టెరీన్* కాటన్
సూటింగ్‌లు మరియు దావరీన్
షర్టింగ్‌లు—అందమైన నేతలలో
కనులను ఆకట్టుకొనే ఆకర్ష
ణీయమైన రంగులలో—
విచక్షణా పరులైన
వారికోసం.

*టెరీన్—కాఫీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.

TA:DCM/C/2 TEL

ఫ్యాషన్ వస్త్రములు.

ది దావణగేరే
కాటన్ మిల్స్ లిమిటెడ్,
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగేరే-577 002

షో రూమ్: కావేరి భవన్, బెంగళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి 580 020. చిత్ర దుర్గా రోడ్, దావణగేరే 577 002.







తీసుకుంది "ఏం మీ అమ్మాయికి బజారు పని చేతకాదా ?"

"అమ్మా! నేనే తెస్తాను" అంటూ అనూరాధ లేచి వంటింటిలోనికి వెళ్ళి సంచీ, సీసా తీసుకొని వీధిలోనికి వెళ్ళింది

సత్యనారాయణ బాణంలా వెళ్తున్న కూతుర్ని చూసి ఆశ్చర్యపోయాడు అనూరాధ ఈ అవమానం సహించలేక వెళ్ళిపోతోందని అనుకున్నాడు

*　　*　　*

"ఇదిగోనండీ! అర్ధరూపాయి మిగిలింది సామానుల చీటీ ఇది" అంది అనూరాధ సుబ్బలక్ష్మి చీటీ చూడసాగింది "మీరు త్వరగా రావాలన్నారని రిక్షాలో వెళ్ళివచ్చాను రిక్షాకు రూపాయిన్నర అయింది" అంది సంజాయిషీగా

మరోగంట గడచిన తరువాత గోపాలానికి, భర్తకు, ఆ వచ్చిన బంధువులకు అరటాకులు వేసి భోజనానికి పిలిచింది పార్వతి

వడ్డనలో అనూరాధ కల్పించుకోలేదు సుబ్బలక్ష్మి ఏమీ అనలేదు

"అన్నయ్యగారూ! ఇంక మేంవచ్చిన పని అయినట్లే! మీ అమ్మాయి నాకూ మా వాడికీ నచ్చింది మీకు మావాడు నచ్చినట్లేనా ?" అంది సుబ్బలక్ష్మి

"ఆడపిల్లవాళ్ళ ఇష్టాయిష్టాలతో ప్రమేయం వుంటుందనుకోను మగపెళ్ళివారు నచ్చుకోవడం వారికోవరం అడిగారు కాబట్టి చెప్తున్నాను మాకూ అబ్బాయినచ్చాడు ఇక కట్నాల దగ్గర కుదరకపోతే అది మా దురదృష్టం" అన్నాడు సత్యనారాయణ

"బాగాచెప్పారు కట్నకానుకలంటే గుర్తొచ్చింది మీకూ అబ్బాయివున్నాడు కదూ ?"

"ఉన్నాడు ఇంకా చిన్నవాడు చదువు పూర్తి కాలేదు"

"చదువుకేం పూర్తౌతుంది ఉద్యోగం వస్తుంది అబ్బాయి పెళ్ళిలో ఎంతకట్నం రాబట్టాలనుకుంటున్నారు ?"

"మూడునాలుగేళ్ళ తరువాతి సంగతి ఇప్పుడప్పుడే ఎలా నిర్ధారణగా చెప్పగలను ?"

"నిజమే! సత్యమైనమాట చెప్పారు ఆనాడు మార్కెట్లో పెళ్ళికొడుకుల రేటు ఎంత వుంటుందో ? ధరవరలు ఇలా రోజురోజుకి పెరిగి పోతూంటే కట్నాలు పెరగవా ? నా చిన్నతనంలో

# పెళ్ళి చూపులు

రెండువేలు నేడు ఆరేటు ఎదిరేట్లు పెరిగింది"

"సుబ్బలక్ష్మిగారూ! ఏనాడో వాడు తీసుకోబోయే కట్నంగురించి ఇప్పుడెందుకు ? మీరెంత కావాలనుకుంటున్నారో చెప్పండి" అన్నాడు గోపాలం

"మావాడి పెళ్ళివిషయం నేనేవాడో ఒక నిర్ధారణకు వచ్చాను అలాగే సత్యనారాయణగారూ తన కొడుక్కి ఎంతకట్నం తీసుకోవాలనుకుంటున్నారో తెలుసుకుందామని పోనీలెండి మావాడు బి టెక్ పాసయ్యాడు ఇంతఇస్తాం ఇంత ఇస్తాం అంటూ వస్తున్నారు మీకు చెప్పానుగా పాతికవేలు వరకు ఇస్తాం అని ఈమధ్యనే ఒకరు వచ్చారు కట్నాల సమస్య ఎంత వుధృతంగా ఉందో నాకు తెలుసు ఎంతమంది ఆడపిల్లల జీవితాలు ఈ సమస్యవలన నాశనమౌతున్నాయో మనం రోజూ పేపర్లో చదువుతున్నాం" అంది

"మీ ఆశయాలు బాగానేవున్నాయి మా వాడు పెద్దగా ఇచ్చుకునేస్థితిలోలేదు ఆ సంగతి మీకు ముందే తెలియజేసాను అందువలన మీ వుద్దేశం చెప్తే బాగుంటుంది" అన్నాడు గోపాలం

"అదే చెప్తున్నాను కట్నం తీసుకోవాలని మేం అనుకోవడంలేదు అయితే నాదొక కండిషను ఉంది" అంది సుబ్బలక్ష్మి

'అమ్మా! సుబ్బలక్ష్మితల్లీ! నీ వుద్దేశం అర్ధమైంది అబ్బాయికి కట్నంతీసుకోరు కాని మీ అమ్మాయి పెళ్ళికి మీరివ్వవలసిన కట్నంమాత్రం మేం ఇవ్వాలి ఇదోలంకె ఈ నాడు అలాగెంతరో లంకెపెడుతున్నారు మీరుమాత్రం తక్కువతిన్నారా? ఇంత గొప్పహోదాలో వున్నారు ఎంత పెద్దసంబంధం చేయాలనుకుంటున్నారో ? ఆ పెళ్ళికొడుకు మాత్రం ఎంతలో కొండ దిగుతాడో ? వాళ్ళు అడిగే డబ్బు మేంఇచ్చుకోలేం మీ కండిషన్లూ వద్దూ మీ సంబంధం వద్దు' అనుకున్నాడు సత్యనారాయణ

"చెప్పండి, ఆ కండిషనేమిటో ?" అడిగాడు వుత్సుకతతో గోపాలం

"అదే చెప్తున్నాను ఈ పిల్లను మేంకట్నం లేకుండానే చేసుకుంటాం ప్రతిఫలంగా మీరు "

"మరి చెప్పకండి — మీ అమ్మాయి పెళ్ళికయ్యే కట్నం మేం ఇచ్చుకోవాలంటారా ? ఆ కట్నం ఇచ్చుకునే స్థితిలోవుంటే మా అమ్మాయి పెళ్ళే చేయగలంగా ?" అన్నాడు సత్యనారాయణ కోపాన్ని అణచుకోలేక

"మీరు పొరపాటుగా అర్ధంచేసుకున్నారు నా ఉద్దేశం అదికాదు ఆడపిల్లవాళ్ళ వద్దనుంచి మేం ఆశించేదదికాదు నేను కేవలం ఆశించేది నా కోడలు సంగీతంలో స్థితప్రజ్ఞురాలు కావాలని కాదు, బంగారుగుడ్లుపెట్టే బాతులాంటిది కావాలని కాదు కట్నం అక్కరలేదుకాని లాంఛనాల రూపంగ స్కూటర్లు, టి వి లూ కావాలని అంతకన్నాకాదు నేను ఆశించేది నా కోడలు వ్యవహారదక్షతకలది మగవాళ్ళు ఉద్యోగాల్లో ఇల్లుపట్టకుండా తిరుగుతారు ఉదయం ఇల్లువదిలితే తిరిగి ఏ రాత్రికో వస్తారు ఇంటిబాధ్యతలు నిర్వహించగలిగే ప్రజ్ఞ కావాలి కానిసమయంలో చుట్టాలు వచ్చినా, నిత్యావసర వస్తువులు నిండుకున్నా భర్త లేడే, ఎలా ? అనే చింతపడకూడదు తానే ఆస్థితిని ఎదుర్కోగలిగినదై వుండాలి అందుకే నా ఈ పరీక్షలు ఆ పరీక్షల్లో అనూరాధ నెగ్గింది ఇంక కట్నాల ప్రసక్తేలేదు మా వాడికి కట్నం తీసుకోరాదని నేను నా పెళ్ళి రోజునే నిశ్చయించుకున్నాను అయితే ఈ పెళ్ళి జరగాలంటే నాదొక కండిషను వున్నమాట మాత్రం వాస్తవం" అంది సుబ్బలక్ష్మి

"ఆ కండిషను ఏదో మీరుచెప్పాలి" అన్నాడు గోపాలం

"సత్యనారాయణగారికీ ఒక అబ్బాయి వున్నాడు మరో మూడు నాలుగేళ్ళ తరువాత పెళ్ళిచేస్తారు వారుకూడా కట్నం ఆశించకుండా ఒక గుణవంతురాలైన పేదపిల్లను చేసుకోవాలి అలా మరో అభాగిని జీవితానికి పూలబాట వేయాలి చెప్పండి ఈ షరతు అంగీకారమైతే ముహూర్తాలు ఎప్పుడు నిశ్చయించినా మేం పెళ్ళికి తరలివస్తాం"

గోపాలం సత్యనారాయణవంక చూసాడు పార్వతి కన్నులు ఆనందంతో చెమర్చాయి సత్యనారాయణ హృదయంలో రాజుకుంటున్న జ్వాలలు చల్లారిపోయాయి ఎంత తియ్యటిమాట! ఇది కలా ? వాస్తవమా ?

"అదిగో! మావాడు ఈ కండిషనుకి అంగీకరించాడు ఔనా సత్యం ?" అన్నాడు గోపాలం ఆనందంగా

సత్యనారాయణ సంతోషంతో పులకించిపోయాడు నోటమాట రాలేదు తనకీ కండిషను సమ్మతమేనని తల వూపాడు ●



డిసెంబర్ 12 ఉదయం ఆటతో విడుదల
రామకృష్ణ సమర్పించు
ఆర్.కె. మూవీస్
రామాపురంలో సీత
కలర్
నిర్మాతలు: జి.గణేశన్, జి.శ్రీనివాస్
స్క్రీన్‌ప్లే-మాటలు-దర్శకత్వం: ధవళ సత్యం
సీడెడ్: శ్రీనాగార్జున ఫిలింస్, చిత్తూరు: ఉమా ఎంటర్ ప్రైజెస్
SREE PUBS.

# సినిమా

## నాయుడుగారబ్బాయిలో రౌడీగాయ అమ్మాయి

రాత్రి మాధవి (అంబిక) ఆలస్యంగా ఇంటికి చేరుకుంది. ఆమె తల్లిదండ్రులైన సుకుమారి, నాగేష్‌ల గుండెలు కుదుటపడ్డాయి.

"ఏమ్మా, ఇంతసేపూ ఎక్కడున్నావ్? ఫంక్షన్‌కు రాకుండా? ఎస్ పి గారమ్మాయి, ఐ టి డి గారమ్మాయి, ఎం ఎల్ ఎ, గారి తమ్ముడూ—ఒకరేమిటి, అందరూ మహిళామండలిలో నీ గురించి అడగటమే," అంది సుకుమారి.

"సారీ మమ్మీ! నేను ఫ్రెండ్స్‌తో సినిమాకు వెళ్లొస్తూంటే, దారిలో ఏం జరిగిందో తెలుసా? సడన్‌గా కరెంట్ ఆఫ్! స్ట్రీట్ లైట్స్ అన్నీ ఆఫ్! కటిక రాతిరి కారుచీకటి. అప్పుడు అరవై మైళ్ళ స్పీడులో నే కారులో వస్తూంటే, ఓ గుర్రం. గుర్రంమీద రాజకుమారుడు -- నా కారుకడ్డంగా నిలబెట్టాడు. అంతే కయ్‌మని బ్రేక్ వేశాను." అంది మాధవి.

"మాధవీ! ఇదంతా ఏమిటి? నువ్వు చూసిన సినిమా కథా?" అడిగింది సుకుమారి.

"కాదు, మమ్మీ! నిజంగా జరిగింది," అంటూ మాధవి తన గదిలోకి వెళ్లిపోయింది.

సుకుమారి, నాగేష్ తెల్లబోతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

కృష్ణ హీరోగా దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలతో ఎన్ రామలింగేశ్వరరావు, బి వి పి ఎ గోపీనాథ్ నిర్మించిన రాజీవి ఫిలిమ్స్ "నాయుడుగారబ్బాయి" చిత్రానికి బి వి ప్రసాద్ దర్శకుడు.

## ఏమండోయ్, శ్రీమతిగారూ! చిత్రానికి రాజమండ్రి పరిసరాలలో బాహ్య చిత్రీకరణ

"రాజమండ్రి, కడియం, అడ్డతీగల, మారేడుమల్లి, రాజమండ్రికి 105 కిలోమీటర్ల దూరంలో ఉన్న కమలా తోటల్లో కొన్ని ముఖ్యమైన సీన్‌లు చిత్రీకరిస్తున్నాం. ఒక బస్సు టాప్‌మీద, బస్సులోపల పిక్చరైజ్ చేసే సాంగ్ హైలైట్. డిసెంబర్ 1, 2 తారీఖుల్లో క్లయ్‌మాక్స్ షూట్ చేస్తాం. ఇదికూడా వెరైటీ సబ్జెక్టు. ఆద్యంతం మంచి వినోదాన్నిస్తుంది," అన్నారు నిర్మాత యు ఎస్ ఆర్ మోహనరావు. దాసరి నారాయణరావు పర్యవేక్షణలో రేలంగి నరసింహారావు దర్శకత్వం నెరిపే రాజలక్ష్మి కంబైన్స్ "ఏమండోయ్, శ్రీమతిగారూ!" చిత్రంలో చంద్రమోహన్, రాధిక, గిరిబాబు, రమణమూర్తి, కె విజయ, నిర్మల, చిడతల అప్పారావు ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. కాశీ విశ్వనాథ్, కృష్ణ – చక్ర, సి నారాయణరెడ్డి, బి కోటేశ్వరరావు, డి రాజగోపాలరావు, ఎం వెంకట్రావు, బాబు, రాము వగైరా సాంకేతికవర్గం.

## బయస్కోప్!

### తొలి క్లోజప్

'ఇన్‌టాలరెన్స్' అనే చిత్రంలో ప్రెసిడెంట్‌ను ఒక దుర్మార్గుడు పిస్టల్‌తో హతమార్చే సన్నివేశం. ఆ షాట్‌లో హంతకుని చేతిలో పిస్టల్ సరిగ్గా కనిపించడంలేదు. అంచేత, పిస్టల్ పేలుడ్ని మాత్రం వేరుగా చిత్రీకరిస్తే ఎలా ఉంటుంది – అనిపించింది గ్రిఫిత్‌కు. అలాగే తీసి చూశాడు. ఫలితం ఎంతో రసవత్తరంగా కనిపించింది. అలా తొలిసారిగా 1916 లో క్లోజప్, ఫిలిమ్ ఎడిటింగ్‌ను ప్రవేశపెట్టిందీ, సినిమాను ఒక కళాప్రక్రియగా మలచి, అభివృద్ధి పరచిన వ్యక్తి డి డబ్ల్యు గ్రిఫిత్.

అంతకుముందు కెమెరా మూవ్‌మెంట్ ఉండేదికాదు. తీయదలచిన దృశ్యం ఎదుట కెమెరాను ఆన్ చేసి, కాస్సేపయ్యాక ఆఫ్ చేయడం ఇంతే. కొంతమంది కార్మికులు ఓ ఫాక్టరీ గేటు తెరవగానే గుంపులుగుంపులుగా వచ్చే షాట్, ప్లాట్‌ఫామ్‌మీదికి ట్రెయిన్ రావడం, ప్రయాణీకులు నౌక దిగి రావడం. ఇలా ల్యూమెరీ సోదరులు 1896 లో కనుగొన్న చలన చిత్రాలలో ఏడు దృశ్యాలను 'ల్యూమెరీ ప్రోగ్రామ్'గా తీసి ప్రదర్శించి, ప్రేక్షకులను చకితుల్ని చేశారు. ఈ షాట్‌లకు ఆ రోజుల్లో సినిమా స్క్రిప్టు అంటూ ఉండేదికాదు – ఏవో డయాగ్రామ్‌లు తప్ప.

### తొలి సినిమా స్క్రిప్టు

ల్యూమెరీ సోదరులు నిర్మించిన 'వాటరింగ్ ది గార్డెన్' హాస్య చిత్రంలో ఒక హాస్య సంఘటనకు మాత్రం ముందుగా స్క్రిప్టు తయారుచేయబడింది. ఒక తోటమాలి రబ్బర్ గొట్టంతో పూలమొక్కలకు నీళ్ళు పోస్తూంటాడు. ఇంతలో ఒక కుర్రాడు వచ్చి ఆ హోస్‌పైప్‌ను తొక్కుతాడు. నీరు చిమ్మడం ఆగిపోతుంది. తోటమాలి తికమకలుపడుతూ తన చేతనున్న రబ్బర్ గొట్టం కొసలోకి అయోమయంగా చూస్తాడు. అప్పుడా కుర్రాడు అప్రయత్నంగా ఆ పైప్ మీదినుంచి తన కాలు తీసేస్తాడు. వెంటనే ఆ తోటమాలి ముఖంమీద పైప్ నీరు చిమ్ముతుంది. అతను పూర్తిగా తడిసిపోతాడు. ఇదంతా లాంగ్ షాట్‌లో తీయబడింది. ఇదే తొలి స్క్రీన్‌ప్లే అనుకోవాలి.

### తొలి ట్రిక్ షాట్

తాంత్రిక ఛాయాగ్రహణానికి మూలపురుషుడు జార్జ్ మెలిస్. 1902 లో ఇతను తయారు చేసిన "హైడ్రో థెరపీ" చిత్రంలో కొన్ని ట్రిక్‌షాట్స్ తీశాడు. తమాషా ఏమిటంటే ఇతను స్వయంగా ఇంద్రజాలికుడు.



'నాయుడుగారబ్బాయి'లో ఒక సన్నివేశం



'అనురాగ దేవత'లో జయసుధ, శ్రీదేవి

# సినిమా

## కె. విశ్వనాథ్ దర్శకత్వంలో ప్రశాంతి క్రియేషన్స్ చిత్రం

"డిసెంబర్ రెండవ వారం నుంచి హైదరాబాద్, విశాఖ ప్రాంతాల్లో షూటింగ్ ఉంటుంది. ఆ తర్వాత రెండవ షెడ్యూల్ జనవరిలో. దీంతో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ కె. విశ్వనాథ్. అల్లు అరవింద్ సమర్పణలో వి. వి. శాస్త్రి నిర్మించే ఈ సంస్థ తొలి చిత్రంలో చిరంజీవి హీరో. గొల్లపూడి, కె. వి. మహదేవన్, వేటూరి, లోక్‌సింగ్, తోట, జి. జి. కృష్ణారావు, శేషు, బాబూరావు, పృథ్విరాజ్ ప్రభృత సాంకేతిక బృందం.

## రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

"మా పిక్చర్‌లో ఇద్దరు హీరోలు, ఇద్దరు హీరోయిన్‌లు ఉన్నారు," అన్నారు మిద్దే రామారావు ఈయన నిర్మించే చిత్రంలో శోభన్‌బాబు, మురళీ మోహన్, లక్ష్మి, రాధ, సత్యనారాయణ, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, నిర్మల ఆదిగాగలవారుంటారు. డిసెంబర్ 1, 2 తేదీల్లో పాటలు రికార్డు చేశారు. భీశెట్టి లక్ష్మణరావు కథకు సత్యానంద్ సంభాషణలకర్త. చక్రవర్తి, వెంకట్ శాయికుమార్, చక్రవర్తి, ఎస్. సత్యనారాయణ ప్రభృత సాంకేతికవర్గం. "డిసెంబర్ 16 నుంచి షూటింగ్," అన్నారు డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి.

## విజయమాధవి పిక్చర్స్ ఎంటర్‌ప్రైసెస్

"నవంబర్ 9న కొత్త చిత్రాన్ని బెంగళూరులో మొదలెట్టాం. నవంబర్ నెలాఖరుకు షూటింగ్ ముగించాం కూడా. ఇదొక హాస్య ప్రధాన చిత్రం త్వరలోనే పేరు నిర్ణయిస్తాం," అన్నారు వడ్డే కిశోర్. ఈయన కె. వాసు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో చంద్రమోహన్, సరిత ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, పద్మనాభం పి. జె. శర్మ, రాళ్ళబండి, చలపతిరావు, నర్ర వెంకటేశ్వరరావు, శ్రీలక్ష్మి, జానకి పాల్గొన్నారు సత్యానంద్, గోపి, జె.వి. రాఘవులు, ఎన్. నవకాంత్ ప్రభృతులు తెరవెనుక కృషి చేస్తున్నారు.

## ఇల్లాలు – చూలాలు

"యువతీ యువకులు, దంపతులు తెలుసుకోవలసిన ఎన్నో అంశాలున్న చిత్రం. ఇంగ్లాండ్‌లో డల్‌హౌసీ యూనివర్శిటీ చలన చిత్రంగా రూపొందించిన ఆధునిక వైద్య విజ్ఞానాన్ని తెలుగులో అనువదించి, సగటు ప్రేక్షకులకు అందుబాటులో తెచ్చాం. ఒక విధంగా ఇది తెలుగులో తొలి సైంటిఫిక్ చిత్రం," అన్నారు సహదేవ వెంకటేశ్వరరావు. ఈయన నిర్మించిన ఎస్.వి.ఎస్ ఎంటర్‌ప్రైసెస్‌వారి "ఇల్లాలు – చూలాలు" చిత్రానికి ఆరుద్ర రచన, ఎస్. రాజేశ్వరరావు సంగీతం ఇతర హంగులు.

## ఇరుగు - పొరుగు

★ "రారా కృష్ణయ్య" తమిళంలో తయారౌతోంది. జె.వి. సోమయాజులు పాత్రను శివాజీగణేశన్, నిర్మల పాత్రను సుజాత ధరిస్తున్నారు.

"శంకరాభరణం" ఇన్‌స్పిరేషన్‌తో "తోడి రాగం" అనే శాస్త్రీయ సంగీత ప్రధాన తమిళ చిత్రం నిర్మాణంలో ఉంది. సంగీత దర్శకుడు కున్నక్కుడి వైద్యనాథన్ ఈ చిత్ర నిర్మాత.

★ పేరులోన పెన్నిధి కలదు ... చిత్రాల 'టైటిల్స్' అమ్ముకోవడం బొంబాయిలో కొందరికి వ్యాపారమైపోయింది. పనీ పాటాలేని ఆ మేధావులు కొందరు కొన్ని ఆకర్షణీయమైన టైటిల్స్‌ను 'ఇండియన్ మోషన్ పిక్చర్స్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్'లో రిజిస్టర్‌చేసి ఉంచారు. అలా నమోదు చేయడానికి రుసుము వంద రూపాయలు మాత్రమే. ఆ టైటిల్స్ లోంచి తమ చిత్రాలకు అనువుగా ఉన్న వాటిని భరణం చెల్లించి పొందడానికి కొందరు నిర్మాతలు పోటీలు పడవలసి వస్తోంది. "ఐ లవ్ యు" టైటిల్ పొందడం కోసం సురేంద్రకపూర్ ఐదు వేలు ముట్టజెప్పాడట. "అశాంతి" టైటిల్‌కుగాను ఎఫ్. సి. మెహ్రా నాలుగువేలు అర్పించుకోవలసి వచ్చిందట. అలాగే "జానీ" టైటిల్‌కు మరో నిర్మాత చాలా ఎక్కువమొత్తం చెల్లించవలసి వచ్చింది.

★ నర్గిస్ స్మృత్యర్థం సెంట్రల్ రైల్వే వారు బొంబాయి విక్టోరియా టెర్మినస్ స్టేషన్‌లో కొత్తగా ప్రారంభించిన ఏర్‌కండిషన్డ్ బఫే రెస్టారెంట్‌కు ఆమె పేరే పెట్టారు.

★ అహ్మదాబాద్ దగ్గర అంబాజీ అనే పుణ్యక్షేత్రముంది. అక్కడ గజేంద్రప్రసాద్ చౌదరి అనే వ్యాపారి తన ఇంట్లో వీడియో ద్వారా సినిమాలు ప్రదర్శిస్తున్నాడట. రోజుకు మూడుౕలేక నాలుగు ప్రదర్శనలు. ప్రవేశరుసుము మూడున్నర రూపాయలు. అతనింటి మీదికి వినోదపు పన్ను శాఖవారు ఈ మధ్య హఠాత్తుగా దాడి చేసినప్పుడు "లవ్ స్టోరీ" చిత్రాన్ని ప్రేక్షకులు చూస్తున్నారట. బొంబాయి, ఢిల్లీల నుంచి చండీఘర్‌కు వెళ్లే కొన్ని హర్యానా రోడ్‌వేస్ బస్సులలో "ఖుర్బానీ, క్రాంతి, జ్యోతీబనే జ్వాలా, ఇన్‌సాఫ్‌కా తరాజు" చిత్రాలు తరచు ప్రదర్శింపబడుతున్నాయట.

★ ఆగస్టు 16 సాయంత్రం ఢిల్లీ రాష్ట్రపతి భవన్‌లో "ప్రేమ్‌గీత్" హిందీచిత్రం ప్రదర్శింపబడింది. చిత్రం చివరన నాయిక మరణించే సీను హృదయాలు ద్రవించేలా చిత్రీకరింపబడిందట. చిత్రం పూర్తయ్యాక ఆడిటోరియమ్‌లో లైట్లు వెలగ్గానే రాష్ట్రపతి సంజీవరెడ్డిగారు పక్కవరుసలో కూర్చొనున్న నాయిక పాత్రధారిణి అనిత వంక చూసి, "నీకు నూరేళ్ళాయుష్షమ్మా !" అని ఆశీర్వదించారట.

★ డి. డబ్ల్యు. గ్రిఫిత్ 1912లో నిర్మించిన "ది న్యూయార్క్ హాట్" చిత్రానికి సినేరియో రాసిన అమితాలూస్ అనే మహిళ ఆగస్టు 18న తన 88వ ఏట కన్నుమూసింది. ఈమె షెరివ్స్ స్క్రిప్టు రాసిన "జెంటిల్‌మన్ ప్రిఫర్ బ్లాండ్స్" హిట్ పిక్చర్‌లో మెర్లిన్ మన్రో నాయిక.



ఇంక ఆగక్కర్లేదు
Binaca Top toothpaste
మీరు కోరుకునే
బినాకా టాప్ తిరిగి వచ్చేసింది
గుర్తుంచుకోండి, బినాకా టాప్
లోగల ప్రత్యేకమైన, పంచే
పదార్థం తక్షణం నోటిలోని మూల
మూలకూ పాకి, పిప్పి పళ్ళుగా చేసే
సూక్ష్మ క్రిములను తుదముట్టించి,
నోటిలోని చెడు శ్వాసను నిరోధిస్తూ
మీకు అనుభవంలోకి వచ్చే తాజా
దనాన్ని యిస్తుంది — ఎప్పుడూ.
FRESHNESS YOU CAN FEEL
Binaca Top toothpaste
బినాకా టాప్ టూత్‌పేస్ట్
మీకు సంపూర్ణ నోటి రక్షణనిస్తుంది
ARMS-CBT-3-143-TL

సీరియల్

# జీవిత వనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

13

(గత సంచిక తరువాయి)

హఠాత్తుగా నా జీవితంలో అనుకోని మార్పులు వచ్చినాయి కిరణ్‌లో నా స్నేహం చెప్పలేని స్థాయికి పెరిగిపోయింది అతనితో నా జీవితం విడదీయరాని బంధంగా ముడిపడిపోయింది అంతకు ముందు నాకు కలిగే చికాకులు, విసుగు తెప్పించే సంఘటనలు, నా జీవితంలో పేరుకుపోతున్న నైరాస్యం ఇప్పుడు మచ్చుకైనా లేవు నాలో ఎక్కడ లేని చలాకీతనం వచ్చేసింది మొహంలో కొత్త కాంతి వచ్చింది

నాలోని ఈ మార్పుకి ఇంట్లో అందరూ ఆశ్చర్యపోయారు ఆఫీసులో అయితే ఒకసారి అందరూ నోళ్ళుతెరిచి నేనసలు సంధ్యారాణినేనా అని చూడసాగారు ఒకరిద్దరు పట్టలేక అడిగేశారు విమల అంతెత్తున ఎగిరిపడి –

"ఏమిటోయ్ సంధ్యారాణీ! ఈమధ్య నీలో కొత్త మెరుపులు కనిపిస్తున్నాయి ప్రేమలో పడ్డావేమిటోయ్" అని హాస్యం చేసింది

ప్రేమ అనే పదం వినగానే నా చెంపల్లోకి రక్తం వచ్చింది

"నిజమేనేమిటోయ్ కొంపదీసి" అని విమల ఖంగారుపడింది

"ఏం నేను ప్రేమలో పడకూడదా?" పెంకిగా అన్నాను

"నువ్వా! ప్రేమలోనా! మైగాడ్" విమల ఫక్కున నవ్వి, "ఈ ఆడివిమనిషిలో కూడా అంత ఓపుంది అంటే నేను నమ్ముతానా? సూర్యుడు తూర్పున కాకుండా పడమర ఉదయించాడన్నా నమ్ముతాను కానీ ఈ జడపదార్థం ప్రేమలో పడిందంటే నమ్ముతానా? హయ్యో రామా!" అని నెత్తికొట్టుకుంటూ "అయినా నీకసలు ప్రేమంటే తెలుసునటే" అని వెక్కిరించి అదేదో పెద్ద జోకయినట్టు పకపకా నవ్వేస్తుంటే, నాకు ఉడుకుమోత్తనం వచ్చింది

"కానీ సంధ్యా! నీలోమాత్రం మొత్తానికి ఏదో మార్పు వచ్చింది పూర్వంలేని చలాకీతనం వచ్చింది మొహంలో కళ వచ్చింది మధ్య మధ్య ఆఫీసు పని చేస్తూకూడా ముసిముసి నవ్వులు నవ్వుతున్నావు కారణం ఏమిటో కాస్త వివరించు సఖీ" అని బతిమాలింది

"అదికూడా నువ్వే చెప్పు" అన్నాను నవ్వుతూ

"బహుశా ఈమధ్య వచ్చిన తెలుగు సినిమాలు చూసి ఉంటావు"

"అచ్ఛా" నేను ఆశ్చర్యంగా చూస్తూ అన్నాను

ఆ రోజు సాయంత్రం నేను కిరణ్‌ని కలుసుకున్నప్పుడు అతను మా గురించి ప్రమీలతో చెప్పేశాను అన్నాడు చెప్పినందుకు అతనిమీద దెబ్బలాడాను మేము ప్రతిరోజూ కలుసుకుంటూనే ఉంటాము మధ్య మధ్య ఫోన్ కూడా చేస్తుంటాడు

ఆ రోజు ఆదివారం -

ఉదయంపూట ప్రమీల వచ్చింది వస్తూనే సంధ్యా! సంధ్యా' అంటూ గావుకేకలు పెట్టింది నేను పరిగెత్తుకుంటూ వచ్చాను, అక్కడే ఉన్న మీనా, ఉష పలకరిస్తున్నా వినిపించుకోకుండా

**జరిగిన కథ - 7 :** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడ పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్ళీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్ళింటి దగ్గర దించి వెళతాడు కిరణ్ సంధ్యకు దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయ్! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్పేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి శశి ఎవరితోనో తిరగడం తన కళ్ళారా చూసిన సంధ్య నిశ్చేష్టురాలవుతుంది ఒకరోజు "సంధ్యా ఐ లైక్ యూ! ఐ లవ్ యూ" అని కిరణ్ చెప్పగా ఆమె ఉబ్బితబ్బిబ్బవుతుంది శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్ళి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు

"సంధ్యా! హాత్ మి లాన్" అంటూ ఆనందంగా చేయిచాచింది

నేను కారణం ఊహించటానికి ప్రయత్నిస్తూ చేయి అందించాను ప్రమీ హఠాత్తుగా "హార్టీ కంగ్రాట్యులేషన్స్ మై డియర్ కంట్రీ గర్ల్" అని అంటూనే నా రెండో చెయ్యికూడా అందుకుని ఒప్పులకుప్ప తిరుగుదాం అంటూనే గిరగిరా తిరగసాగింది

ఇంట్లో అందరూ ఫ్రీ షో చూస్తున్నట్టుగా నిలబడ్డారు చేతిలో పుస్తకంతో శశి, చేతిలో గరిటతో అమ్మా అలాగే అక్కడికి వచ్చారు

"ప్రమీ! ప్రమీ! నా తల్లీ కళ్ళు తిరుగుతున్నాయే" అని లబ్బున మొత్తుకున్నాను ప్రమీల చివరికి అలసిపోయినదానిలా నన్ను వదిలి అక్కడున్న కుర్చీలో కూలబడి,

"మీనా! మంచినీళ్ళు" అంది రొప్పుతూ

నేను క్రిందనే కూలబడ్డాను కళ్ళు తిరుగుతున్నట్లుంటే

గబగబా మంచినీళ్ళు త్రాగి "సంధ్యా! ఈ విషయం వినగానే నేను ప్రపంచం తలక్రిందులయిపోయిందనుకున్నానే మా సంధ్యకి ఆమాత్రం తెలివి ఉందానా" అంటూ ఇంకా ఏదో అనబోయింది

అప్పటికే నేను మెరుపులా లేచి ప్రమీ నోరు మూసి అమ్మవైపు తిరిగి "అమ్మా! రెండు కప్పులు కాఫీ" అని చెప్పి, ప్రమీలని నా గదిలోకి లాక్కెళ్ళి గడియపెట్టాను అది నావైపు తిరిగి చప్పున నా రెండు చెంపలూ గట్టిగా ముద్దుపెట్టుకుంది ప్రమీల కళ్ళల్లో చప్పున నీళ్ళు చిప్పిల్లాయి తుడుచుకుంటూ "సంధ్యా! నా పిచ్చిసంధ్య కూడా ఒకదారిలో పడిందంటే నాకు ఆనందంతో మతిపోతున్నట్లుగా ఉంది" అంది

నా మనసు స్నేహభావంతో ఆర్ద్రత చెందింది

"ప్రమీ!" అన్నాను

ప్రమీల తన మామూలు హాస్యధోరణిలో "అన్నయ్య చెప్తే నమ్మలేదు అప్పుడే పరిగెత్తుకు వద్దామనుకున్నాను కానీ కుదరలేదు" అంది తర్వాత కాఫీ తాగి ఒక అరగంట ఇల్లంతా నవ్వులతో హోరెత్తించి "ఇక వెళ్ళొస్తాను" అంటూ బయలుదేరింది నేనూ బస్‌స్టాపుకి వెళ్ళాను

వెళ్ళిపోయేముందు "అయినా మా మొద్దు సంధ్య, ఒట్టి పిచ్చిసంధ్య, ఒట్టి చాదస్తపు సంధ్య ప్రేమలో పడిందంటే వాట్ ఏ వండ్రఫుల్ జోక్" అని నన్ను తెగ మెచ్చుకుంది

ఒక రోజు నేను, కిరణ్ ఎక్కడెక్కడో తిరిగి ఎనిమిది గంటలకు ఇంటికి వస్తున్నాము మా సందు తిరగబోతుంటే మా ప్రక్కనుండే స్కూటర్ ఒకటి వెళ్ళిపోయింది నాకెందుకో అనుమానం వచ్చింది

"కిరణ్ ఆపేసెయ్యి" అన్నాను కిరణ్ టక్కున ఆపేసి "ఎందుకు?" అన్నాడు నేను చప్పున దిగి "ఆ వెళ్ళేది మా ఇంటి పక్కమ్మాయిలా ఉంది మళ్ళీ చూసిందంటే లేనిపోని గోల" అన్నాను

అతను సీరియస్‌గా చూసి "అయితే నన్నే మీ ఇంటికి తీసుకువెళ్ళి మీవాళ్ళకి పరిచయం చెయ్యి" అన్నాడు

నా చెయ్యి గుండెలమీదికి పోయింది "అమ్మో!"

"భయమెందుకు?" అతను చిరాగ్గా అన్నాడు

నేను అతని చెంపమీద చిటికెవేస్తూ "ఆరోజు వస్తే తప్పకుండా నేనే తీసుకువెడతాను గుడ్‌నైట్" అన్నాను

అతను గుడ్‌నైట్ చెప్పి వెళ్ళిపోయాడు నేను వేగంగా నడవసాగాను నా ముందు తెల్లటిచీర కట్టుకుని కలలు కంటున్నదానిలా అతినెమ్మదిగా ఒక్కొక్క అడుగే వేస్తూ నడుస్తున్న శాల్తీ శశే సందేహంలేదు

"శశీ" నేను గబగబా శశిని కలుసుకుంటూ పిలిచాను

శశి ఉలిక్కిపడి చూసింది ఆ కళ్ళు నన్ను చూడగానే వెలవెలబోయినయి

"ను ను నువ్వా!" తడబడుతూ అంది

"అవును నేనే! అదేమిటి ఇంతవరకూ ఏంచేస్తున్నావు" అనుమానంగా అన్నాను

శశి క్షణంసేపు మాట్లాడలేదు తర్వాత నెమ్మదిగా –

"నా వా . స్నేహితురాలు మీరాకి ఒంట్లో బాగుండలేదంటే చూడటానికి వెళ్ళాను అందుకని" అంది ఆ కుంటి సంజాయిషీ నా కసలు నచ్చలేదు

అమ్మాయి ఈ కాలేజీ అమ్మాయిలు మిడిమిడి జ్ఞానంతో ప్రేమలూ, పెళ్ళిళ్ళూ అంటారు తీరా అవన్నీ ఎండమావులయ్యేసరికి ఏడుస్తూ కూర్చుంటారు ఆ కుర్రవాడు ఇంకా స్టూడెంట్‌లాగానే ఉన్నాడు ఉద్యోగం సద్యోగం లేకుండా, తల్లిదండ్రుల అనుమతిలేకుండా శశిని ఏ ధైర్యంతో పెళ్ళి చేసుకుంటాడు ?

ఆ ఆలోచన రావటం ఆలస్యం శశిమీద నాకు ఎట్టరాని ఆగ్రహం వచ్చింది ఆ రాత్రి పడుకోబోయే ముందు శశిని నా గదిలోకి రమ్మన్నాను అది ఏమందు భయపడినదానిలా తలుపులు వేసి నా ఎదురుగా మంచంమీద కూర్చుంది తల దించుకుని కూర్చోవటంమూలాన దాని మొహంలో కదులుతున్న భావాలు నేను కనిపెట్టలేకపోయాను ఈసారి నేను ఎటువంటి జంకు, గొంకు లేకుండా సూటిగా అడిగేశాను –

"శశీ ! ఎవరతను"

శశి అదిరిపడి చూసింది చప్పున తల వాల్చుకుని బెడ్‌షీట్‌మీద గీతలు గీయసాగింది

"అతనితో నీకు ఎన్నాళ్ళబట్టీ పరిచయం"

శశి మాట్లాడలేదు

నేను కఠినంగా అన్నాను 'శశీ ! నువ్వు చదువుకుని ఈ ఇంటికి కొంత ఆధారమవుతావని ఇన్నాళ్ళబట్టీ అనుకుంటూ వచ్చాను నువ్వు ఇంకా తెలివితక్కువగా చదువయిన కాకముందే ఏ ఠికానా లేని వ్యక్తి వెంట ప్రేమ, గీమ అంటూ పడతా వనుకోలేదు నీకసలు జ్ఞానం ఉందా ? బుద్ధి ఉందా ? అతనెవరో, స్థితిగతులేమిటో తెలుసుకోకుండా పిచ్చిప్రేమలో పడిపోతావనుకోలేదు నువ్వు నా కిచ్చిన వాగ్దానం నిలబెట్టుకోలేదు"

"అక్కా !" శశి రోషంగా అంది నేను ధుమధుమలాడాను

"పోనీ అతనితో నీ పరిచయం ఎప్పటినుండో చెప్పు, కాస్త వింటాను"



"అయితేమటుకు ఇంత ఆలస్యమా ?" కసిరాను

ఇద్దరం కలిసి ఇంట్లోకి అడుగుపెట్టగానే అమ్మ నిర్ఘాంతపోయినదానిలా చూసింది

"ఇదేమిటే ఎక్కడికి వెళ్ళారు ఇద్దరూ" అంది

ఈసారి నేను తికమకపడాల్సి వచ్చింది.

"నాకు కొంచెం పనుండి ఆలస్యం అయిందిలే" అంటూ శశిని భావగర్భితంగా చూసి లోపలికి వెళ్ళిపోయాను నా పరిస్థితి ఇప్పుడు కుడితిలోపడ్డ ఎలుకలా ఉంది నేను శశిని మందలించే అర్హత కోల్పోయినట్టుగా అనిపించసాగింది శశిమీద నాకెన్నో ఆశలు ఉన్నాయి అతనితో దాని స్నేహం ఎంతవరకో నేనూహించలేకుండా ఉన్నాను నా పరిస్థితి వేరు కిరణ్ బుద్ధిమంతుడు ముఖ్యంగా ప్రమీలకి అన్నగారు కాబట్టి నేను మోసపోతాను అనేది కల్లో కూడా జరగని విషయం శశి ఇంకా చదువుకుంటున్న

"దాదాపు ఏడెనిమిది నెలలబట్టి" శశి మెల్లిగా అంది

"ఏమిటీ!" నేను నమ్మలేనట్టు చూశాను

"అవును"

'ఏం చదివాడు, నీకెలా పరిచయం?"

"నా క్లాస్‌మేట్ నీరజకి అన్నయ్య అతను ఎం ఏ చదువుతున్నాడు"

'అచ్చా!" నేను ఆశ్చర్యంగా అన్నాను

"అతను నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు"

"పెళ్ళి చేసుకుని 'ప్రేమ' భోజనం చేస్తారా రెండు పూటా" వ్యంగ్యంగా అన్నాను నాకు ఒళ్ళు మండిపోతోంది ఒకవక్క శశి ఉద్యోగం చేసి ఈ కుటుంబానికి ఆధారంగా నిలబడితే నేను పెళ్ళి చేసుకోవాలని ఇన్నాళ్ళూ కలలు కంటున్నాను ఇవికాస్తా ఎండమావులవుతాయేమోనని భయం వేస్తోంది నేను ఉక్రోషంతో ఏదో ఒకటి వాగి దాన్ని ఆ ప్రయత్నంనుండి విరమించటానికి నిశ్చయించుకున్నాను

శశి ఉక్రోషంగా అంది "అక్కా! నువ్వింత అన్యాయంగా మాట్లాడకు అతనికి ఉద్యోగం వచ్చిం తర్వాతే పెళ్ళి చేసుకుంటాను"

నేను రెప్పవాల్చకుండా శశివైపే చూడసాగాను శశిలో ఉక్రోషమంతా ఒక్కసారి దిగిపోయింది ఆ కళ్ళు భయంతో రెపరెపలాడినాయి చప్పున తల వాల్చుకుంది

"భేష్! అయితే అన్ని ఏర్పాట్లు ముందుగానే చేసుకున్నారన్నమాట వెరీగుడ్! కానీ శశీ! నీ సోదరిగా, నీ మంచిచెడులు చూడాల్సిన పెద్దదానిగ ఒక్కమాట చెప్తాను విను నాకసలు ఈ ప్రేమలంటేనే నమ్మకం లేదని మీ అందరికీ తెలును మంచివ్యక్తితో, ఒక నిర్దుష్టమైన భావాలుగల యువకుడ్ని ప్రేమించి పెళ్ళిచేసుకుంటే జీవితం వడిదుడుకులు లేకుండా హాయిగా సాగిపోతుంది మనస్సు శాంతివనంలా నిర్మలంగా ఉంటుంది కానీ తాడు బొంగరంలేని వ్యక్తితో జీవితం చాలకష్టం శశీ ఈ కాలపు కుర్రాళ్ళలో ఉడుకురక్తం మరీ వేగంగా పరుగులు తీస్తోంది ఈ ప్రేమ జర్వంలో ఏమీ తలకెక్కదు సంధిప్రేలాపనలా ప్రేమ, ప్రేమ అని కలవరిస్తుంటారు ఒక్కసారి జీవిత విలువలు అవగతం అయ్యే సరికి, ఆ ప్రేమజ్వరం తగ్గిపోయి పూర్తిగా నార్మల్‌కి వచ్చి 'ఈపెళ్ళి ఎందుకుచేసుకున్నానురాభగవంతుడా' అని తల పట్టుకోవలసి వస్తుంది"

శశి కొత్త విషయాలేవో వింటున్నదానిలా విప్పారిన నేత్రాలతో చూస్తోంది నేను చివరిగా అన్నాను —

"శశీ! నువ్వు పెళ్ళిచేసుకుని సుఖంగా ఉంటే నేనుమాత్రం సంతోషించనా? కానీ నా విన్నపం ఒక్కటే ఉంది నువ్వు చదువుకుని, ఉద్యోగం చేసుకుంటూ అతన్ని పెళ్ళిచేసుకో ఎందుకో తెలుసా? ఉద్యోగాలు ప్రేమలు పుట్టినంత తేలిగ్గా పుట్టవు దానికి అదృష్టం ఉండాలి అతనితో రేపు నీకు ఏ పేచీ వచ్చినా నీ కాళ్ళమీద నువ్వు ధైర్యంగా నిలబడి ఛాలెంజిగా బ్రతగ్గలగాలి మొగుడు తన్ని తగిలేసినా వాడి కాళ్ళదగ్గరే బ్రతుకు వెళ్ళ దీసుకోవాలి అనుకునే ఛాదస్తపు తరం కాదు మనది



ఎందుకే చెప్తున్నాను ఆ తర్వాత నీ ఇష్టం ఇంత కన్నా నేనేం చెప్పలేను" నేను పక్కకి తిరిగి పడు కున్నాను

శశి నిశ్శబ్దంగా తలవంచుకుని వెళ్ళిపోయింది నా చురకలు బాగానే తగిలినట్లున్నాయి శశికి ఎంతో అభిమానం మొదటినుండి అది తప్పకుండా నామాట వింటుందనే నా నమ్మకం సరి శశి ఏంచేస్తుందో? లేకపోతే నిండా ఇరవై ఏళ్ళులేని శశికి ప్రేమజబ్బు పట్టటం ఏమిటి? నేను చిరాగ్గా అనుకున్నాను కిరణ్ గుర్తుకు వచ్చాడు తప్పేం లేదు నేనేం తప్పటడుగులు వేయటంలేదు అను కున్నాను దృఢంగా

## 14

వేసవికాలం ప్రవేశించింది ఎండలు బదర గొట్టేస్తున్నాయి సాయంకాలం అయినా ఎండ తీక్షణత పూర్తిగా తగ్గలేదు అస్తమిస్తున్న సూర్య బింబం ఎర్రగా ఉంది ఆ ఎర్రటి రంగులో ప్రపంచ మంతా బహుసుందరంగా ఉంది

పబ్లిక్‌గార్డెన్స్‌లో —

ఒకచెట్టుక్రింద కూర్చుని నేనూ, కిరణ్ కబుర్లు చెప్పుకుంటున్నాము అంతలా చెప్పుకునే కబుర్లు మా ఇద్దరికీ రోజూ ఏముంటాయి? అని నాకే ఒక్కోసారి ఆశ్చర్యం వేస్తుంటుంది కబుర్లు చెప్పుకుంటూ, ఫక్కున నవ్వుకుంటూ, తర్వాత ఏ హోటల్‌లోనో కాఫీతాగి ఇంటికి వెళ్ళిపోవటం అలవాటయి పోయింది ఒక్కోసారి ఏ కబుర్లూ లేనప్పుడు పార్కులోని పిట్టలను గురించి, చెట్లు, వాటి ఆకులు, పూలనుగురించి కిరణ్ చిన్నపిల్లలకి కథలు చెప్తున్నట్టు చెప్తూ నవ్విస్తుంటాడు నేను పకపకా నవ్వుతుంటే 'అదీ నువ్వు ఎప్పుడూ ఏ చీకూ చింతాలేకుండా అలా నవ్వుతూ గడపాలి నీతోటి నా జీవితం నవ్వుల జల్లులా ఉండాలి నా జీవిత వనంలో నీ నవ్వు చిరుజల్లులా కురువాలి ఆ చిరు జల్లుకి నా ఆశలు, ఆశయాలు, కోరికలు చిగుళ్ళు వేసి పచ్చగా కళకళలాడాలి నా సుఖం, నా సంతోషం పువ్వుల్లా వికసించాలి మనిద్దరం జీవితంలోని మకరందాన్ని గ్రోలి, హాయిగా ఆనందంగా, ప్రతిజంటా మనల్నిచూసి ఈర్ష్యపడేలా బ్రతకాలి'

అని వర్ణించి చెబుతుండేవాడు అటువంటి జీవితమేదో కళ్ళముందు కదులుతుంటే నేను బాహ్య ప్రపంచం మరిచిపోయి అతని భుజంమీద తల వాల్చుకుని వింటుంటాను ఈ రోజు అతను జీవితవనం అంటూ క్రొత్త విషయాలు చెప్తూ పైచెప్పిన కలలు కవిత్వంగా వర్ణించి చెప్తుంటే అతని వాగ్ధాటికి, ఆ కంఠంలోని మృదుగంభీరతకి నేను తన్మయురాలిలా ఈ లోకాన్నిమరిచి సీతాకోక చిలుకలా ఆ జీవితవనంలోకి విహారానికి వెళ్ళి పోయాను

"సంధ్యా! ఏమిటి! నిద్రపోతున్నావా?"

హఠాత్తుగా గట్టిగా నా భుజంమీద చెయ్యి పడటంతో స్వప్న లోకంలోనుండి హఠాత్తుగా క్రిందపడ్డట్టు చూశాను

"నేనింత సేపటినుండి చెప్పిందంతా వేస్టేనా" అతను కోపంగా అన్నాడు నేను మళ్ళీ అతని భుజంమీద తలవాల్చుకుంటూ 'ఊ హుహూ! అబద్ధం ఇంకా చెప్పు చాలా బాగుంది జీవితమంటే ఇంత ఆనందంగా ఉంటుందని నాకు తెలీదు" అన్నాను

"సరిపోయింది ఇందాకేదో మూడ్‌లో ఉండి ఏదేదో చెప్పాను మళ్ళీ చెప్పమంటే నా చేతగాదు" అన్నాడు

"అ వస్తుందిలే చెప్పు" గారంగా అన్నాను అతను హఠాత్తుగా మాట మార్చేస్తూ "ఏమిటి సంధ్యా! నువ్వు నిజంగా నిద్రబోయినట్లున్నావు చూడు ఎలా చెమటపట్టిందో" అన్నాడు నా నుదుటి మీద చెమటని తుడుస్తూ

నేను కొంటెగా అడిగాను

"కిరణ్, నువ్వు చెప్పిన ఆ జీవితవనంలో చల్లటి గాలి వస్తుందా?"

అతను తెల్లబోయినవాడిలా చూసి "అదేమిటి?" అన్నాడు

"అదంతేలే చెప్పు! చల్లటిగాలి వస్తుందా?"

అతను ఫక్కున నవ్వి "ఈ పార్కులో ఆ చెట్లు చల్లటిగాలి నివ్వటంలేదూ? ఏమిటా పిచ్చిప్రశ్న?" అన్నాడు

నేను అతనితో శృతి కలుపుతూ అన్నాను—

"ఏంలేదు కిరణ్! మా ఇల్లు మరీ చిన్నది కదా? అందులో నా గది మరీ ఇరుకు అందులో ఎండాకాలం కదా! కిటికీ తెరిచి ఉంచినా అసలు గాలి ఆడక చిరాగ్గా ఉంటోంది అసలు రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపట్టటంలా, దోమల సంగీతం తెల్లవార్లూ దానికితోడు"

అతని నవ్వు చటుక్కున ఆగిపోయింది ఆ మొహంలో బాధ రెపరెపలాడింది "సంధ్యా!"

"ఏం! అందుకే నువ్వు చెప్పే ఆ జీవిత వనంలో చల్లటిగాలి ప్రశాంతంగా వీస్తుంటే, అబ్బో హాయిగా నిశ్చింతగా నిద్రపడుతుందిగా" అని అడిగాను

అతను నా భుజంపట్టి దగ్గరకు లాక్కుని "నా సంధ్యా! నీవింత పిచ్చి అమ్మాయి వేమిటోయ్" అన్నాడు

నేను అతని మొహంవైపే చూస్తూ "దాహం వేస్తోంది" అన్నాను అతను చప్పునలేచి "లే! ఏదైనా హోటల్‌కి వెళదాం" అంటూ చేయి అందించాడు నేను అందుకుని లేస్తూ "ఊహూ వద్దు బయట చెరుకురసం బండి ఉంది అది తాగుదాం" అన్నాను

'సరే! అయితే నేను వెళ్ళి తెస్తాను' అని కిరణ్ వెళ్ళిపోయాడు నేను అతనివెళ్ళినవైపే చూస్తూ హాయిగా అటూ ఇటూ తిరుగుతూ అక్కడ ఎగురుతున్న పిట్టల్ని చూస్తున్నాను అక్కడ నుండి కదిలి రాబోతుంటే హఠాత్తుగా ఎవరిదో ఏడుపు వినిపించింది నేను చప్పున ఆగి ఒంగి చూశాను అంతే! నా గుండెలు ఆగిపోతాయోమో అనిపించింది శశి కూర్చుని ఏడుస్తోంది అతను పక్కనే కూర్చుని —

"ప్లీజ్ శశీ! నాకు కారణంచెప్పు నువ్వసలు నన్నుకలిసి ఎన్నిరోజులయిందో తెలుసా? నీరజని పంపించేదాకా నేను మనిషిని కాలేకపోయాను ఎందుకు? ఏమయింది? ఏం జరిగిందని ఏడుస్తు న్నావు" అతను బ్రతిమాలుతున్నాడు

"ప్లీజ్ ప్రకాష్! నన్ను మర్చిపో దయచేసి నన్ను ఏమీ అడగవద్దు" శశి అంటోంది

"అంత అపరాధం నువ్వేంచేశావు చెప్పు శశీ! మీ అక్క ఏమైనా అందా"

"ఊహూ"

"నేను నమ్మను"

శశి రోషంగా తలెత్తి "ఎంతసేపు ప్రేమ, పెళ్ళి అంటావు పెళ్ళిచేసుకుని నన్ను ఎలా పోషిస్తావో చెప్పు" అంది

"శశీ" అతను వెనక్కు తగ్గాడు

"అవును ప్రకాష్! నీకు ఉద్యోగంలేకుండా, నాకు ఉద్యోగం లేకుండా, అసలు మనఇద్దరి చదువులే పూర్తి కాకుండా పెళ్ళిచేసుకుని చెక్కభజన చేద్దామా" రోషం ఏ మాత్రం తగ్గలేదు శశిలో

"ఉద్యోగం ఎందుకురాదు శశీ? ఉద్యోగం వచ్చింతర్వాతే పెళ్ళి చేసుకుందాం" అన్నాడు ఆ ప్రకాష్ అనే కుర్రాడు

"బాగుంది! నేను ఉద్యోగంచేసి కుటుంబానికి ఆసరా ఇవ్వాలని మా అక్క ఆజ్ఞ"

"అజ్ఞా! పోనీ! అలాగే కానివ్వు నీ జీతం నువ్వు ఇంట్లో ఇచ్చెయి అప్పుడు మీ అక్కకి అభ్యంతరం ఉండదుగా"

శశి సమాధానం చెప్పలేదు తర్వాత అంది—

"మా అక్క మాత్రం యోగినా! పెళ్ళి పెటాకులూ లేకుండా బ్రతకటానికి నాలుగేళ్ళబట్టీ అక్క సంసారం లాక్కువస్తోంది ఇప్పుడు నేను భాగం పంచుకోకపోతే మా అక్క బాధపడదూ? మా అక్కని బాధపెట్టటం నా కిష్టంలేదు మా అక్క ఒట్టి అమాయకురాలు నన్ను జాగ్రత్తగా జీవితాన్ని దిద్దుకోమని సలహా ఇచ్చిందే తప్ప ఒక్క మాట అనలేదు ప్రకాష్, నీకు నిజంగా నామీద ప్రేమే ఉంటే ఉద్యోగం సంపాయించుకున్న తర్వాత నాతో మాట్లాడు అక్కకి పెళ్ళి కాకుండా నేను పెళ్ళి చేసుకోవటం ఏం న్యాయం? నా జీవితానికో ఆధారం లేకుండా నేను పెళ్ళి చేసుకోను పెళ్ళయినా మా అమ్మకి నేను డబ్బు సాయం చేస్తాను నీ కిష్టమున్నా లేకపోయినా నువ్వు అంగీకరించక తప్పదు ఆ అర్హత మన ఇద్దరికీ లభించినపుడే మనం పెళ్ళి చేసుకుందాం అంతవరకూ మనం కలుసుకోవటంకూడా నా కిష్టంలేదు"

శశి చెప్పదలుచుకున్నదంతా చెప్పేసి చప్పున లేచి గట్టిగా కళ్ళు తుడుచుకుంటూ, గబగబా వెనక ఎవరో తరుముకువస్తున్నంత వేగంగా వెళ్ళిపోయింది నేను పక్కకి తప్పుకున్నాను ప్రకాష్ మతిపోయిన వాడిలా శశీ, శశీ అని పిలుస్తూ లేచివచ్చాడు అప్పటికే శశి వెళ్ళిపోయింది అతను నీరసంగా కాళ్ళు ఈడుస్తూ వెళ్ళిపోయాడు

నేను నిశ్చేష్టురాలిలా నిలబడిపోయాను మై గాడ్ శశీ! ఎంత అభిమానం నేనన్న మాటలు బాగా పనిచేసినట్లున్నాయి అందుకే అలా మాట్లాడింది నిజంగా దానికి నేనంటే ఎంత అభిమానం? నేను కష్టపడిపోతున్నానని ఎంత బాధపడింది? పెళ్ళి చేసుకున్నా అమ్మకి డబ్బు ఇస్తుందట! ఎంత పెద్దమనసు ఈ శశినేనా నేను తిట్టుకుంది?

---

## జీవితవనంలో కొత్తగాలి

లేదు, లేదు! అతన్ని పెళ్ళి చేసుకుంటానంటే నేను కాదన్నానా? కుటుంబం ఒక గట్టుకి చేరితే ఆ ఆనందం మా అందరిదీ కాదూ? పిచ్చితల్లీ, ఎంత ఎదిగిపోయావే!

నేను కంపించిపోతూ అలా నిలబడిపోయాను

''ఇదేమిటి! ఇక్కడ నిలబడ్డావు చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయావనుకుంటున్నాను''

నేను చివ్వున తిరిగిచూశాను కిరణ్, అతని వెనక గ్లాసులు పట్టుకుని ఒక కుర్రాడు నిలబడి ఉన్నాడు నేను కొంగుతో ముఖం తుడుచుకుంటూ గ్లాసు తీసుకుని గడగడా తాగేశాను అతను నెమ్మదిగా తాగుతున్నవాడల్లా ''ఏమిటి దాహం తీరలేదా?'' అన్నాడు

నేనేదో అనబోయేలోపలే ఆ కుర్రాడిని ఇంకో గ్లాసు తెమ్మన్నాడు నేను వద్దని వారించాను అతను తనగ్లాసులోని చెరుకురసం నా గ్లాసులోపోసి 'తాగు' అన్నాడు అదికూడా తాగేశాను కిరణ్ ఆ పిల్లాడికి డబ్బులిచ్చి పంపేశాడు

ఇద్దరం కూర్చున్నాము

''సంధ్యా — అలా ఉన్నావేం'' అన్నాడు

నేను ఏంలేదు అని చెప్పాను — చీకటి పడిపోయింది ఇద్దరం బయల్దేరాము అతను బజార్లో ఒకచోట స్కూటర్ ఆపి 'దిగు' అన్నాడు

''ఎందుకు'' నేను ఆశ్చర్యంగా అన్నాను హోటల్ అయితే అలా అడిగేదాన్నికాదు

''నువ్వు గాలిలేకుండా బాధపడక్కర్లేదు మంచి ఫ్యాన్ కొందాం రా'' అన్నాడు నేను బిత్తరపోయిన దానిలా చూశాను అతనిమొహం సీరియస్‌గా ఉంది

''మా ఇంట్లో ఎంచక్కా విసన కర్రలు ఉన్నాయి బాబ్బాబు నీకు పుణ్యం ఉంటుంది వెళ్ళిపోదాంరా'' అన్నాను

అతను ఎంతచెప్పినా నేను వినలేదు

''నా మాటవిను సంధ్యా! నా డబ్బు నీ డబ్బు కాదా నువ్వు గాల్లేకుండా బాధపడుతుంటే నేను నిశ్చింతంగా ఎలా నిద్రపోగలను'' అతను నచ్చచెప్పాడు

''ఊహూ! ఇన్నాళ్ళు బ్రతకలా? ప్లీజ్ కిరణ్ నాకు ఇష్టంలేదు ఫ్యాన్ ఇప్పుడు అవసరంలేదు'' అన్నాను

''అయితే నేను నీ వాడిని కాదన్నమాట''

నేను తుపాకీగుండు తగిలిన దానిలా విలవిల్లాడుతూ ''ప్లీజ్ కిరణ్! డోంట్‌మిస్టేక్‌మీ! ఇప్పుడు దాని అవసరంలేదు అన్నానంతే'' అన్నాను

''మరి నువ్వు ఎందుకు ఒప్పుకోవు''

నేను అతని బుగ్గమీద సొట్టను చూస్తూ నవ్వుతూ అన్నాను—

''మనపెళ్ళయింతర్వాత నువ్వు అడక్కుండానే కిరణ్ అవికొను, ఇవికొను అని నేనే కోరుకుంటాను అబ్బసంధ్యా! ఇప్పుడు నెలాఖరన్నా, నాదగ్గర డబ్బులేదు అని లబలబలాడినా, నేను ఛస్తే ఊరుకోను తెలుసా'' బెదిరింపుగా అతను ఫక్కున నవ్వి స్కూటర్ స్టార్టు చేశాడు

(ఇంకా వుంది)

( గత సంచిక తరువాయి )




 [ఇంకా ఉంది]



# దేవతా వస్త్రాలు

పాంచాలి

సింగ భూపాలురంగారి రాణీవాసం చాలా సందడిగా ఉంది. పసందుగా కనులకు విందు కూర్చేట్టుగా ఉంది. మందయానలు అందంగా తిరుగాడు తున్నారు. శిల్పులు చిత్రకారులు అందంగా తీర్చి దిద్దిన శిల్పాలు చిత్రాలు. పాతకొత్తల మేలుకలయకను తలపుకు తెస్తున్నాయి.

అంగనా మణులు రంగ వల్లరులలో వారి వాగి శృంగార రసస్రపుత తేట తెల్లం చేస్తున్నాయి.

ముద్దరాళ్ళు ముద్దు ముద్దుగా మాటా డుతూ, ఏదో తీరుక లేని పనుల్లో ఉన్నట్లు అటూ యిటూ నడయాడు తున్నారు.

వెలుపల ద్వారం ముందు పల్లకీ ఆగి ఉంది. బోయీలు అనుజ్ఞకోసం వేచిఉన్నారు.

రాణీవాసంలో నుండి, మహీపతులంగారి పట్టమహిషిణి, విధూషిణీ మణులు వెంట రాగా అల్ల అల్లన వచ్చి పల్లకీలో ఆసీను లయ్యారు. బోయీలు మేనాను ఎత్తుకున్నారు. అందలం సాగింది. దాని వెనుక ముందుల్లు పోటు బంట్లు నడుస్తున్నారు.

పల్లకీ అలా సాగిపోగానే; హడావిడిగా తిరుగుతున్న దాసీజనం, కాస్త అటూయిటూ గాలి పీల్చుకొంటూ కబుర్లలోనికి దిగారు.

ఒకతె వయ్యారంగా "ఏమే కీరవాణీ! మహారాణులంగారే స్వయంగా పిల్వడానికి బయలుదేరారు. పోతన గారంత ఘనులా? లేక! సామంత శ్రీమంతులా? యేమిటీ? యిందులోని విషయం?" అన్నది.

అది విన్న ప్రక్క పరిచారిక ముక్కుమీద వేలుంచి' "మధూలికా! మనకేం తెలుస్తుంది? సర్వజ్ఞ రావు సింగ నరపాల దేవేరులే బయలుదేరారంటె ఏదో గొప్ప విశేషమే ఉంటుంది" అన్నది.

"ఆఁ! ఆఁ! మరీ అంత ఆశ్చర్యపోకు. అది శ్రీనాధ కవి సార్వభౌముల వారి విర్వాకం తన చెల్లెలింగారికి సామంత గౌరవాలందిం చాలని"

"అమ్మక చల్లా! అంతవరకేనా విశు పడుతున్నది! దీని వెనుక ఉన్న అసలు విషయం ఎరికీ తెలియదూ! అది మహాకవుల మాయాదారి యెత్తుగడ!" అంది.

"ఏమిటంటావ్ ?"

"పోనిస్తూ మనకేలనా గొడవ. అయినా అడిగినావు గాన పోతనా మాత్యుల వారు, తన భాగవతాన్ని నరాంకితం చేయనని మొరాయించాడు సర్వజ్ఞులు సార్వభౌములు జంటగా వెళ్ళి అడిగితే! ఇమ్మనుజేశ్వరాధముల కమ్మను అన్నారు. అటువంటి కవుల పంచకు దేవేరులనే పంపడంలో వింత విషయం దాగి ఉందో యోచించు" అన్నది ప్రక్క ప్రక్కల ఎవరైనా తమ ప్రసంగం వింటున్నారా అని అటూ యిటూ చూస్తూ.

"నరపాలురు మహాకవులూ నాయి ! వారి చిత్తం మనలాటి వారికి విధిత మౌతుందా ? దానిని గూర్చి కొండల మందడం యేమిటి ? చేటికా ప్రవృత్తికే నీరెత్తి రా వచ్చు మనకేల ?' అన్నది వింటున్న పరిచారిక.

రెండో పరిచారిక వాగుడుకాయ. అది ఊరకే ఉండే వల్కొంగలది గాదు. "అందుకు కాదే ! అయినా ఆయనకేం మడులూ మాన్యాలూ ఉన్నాయా? ఆమాటనేఅన్నారుట శ్రీనాథులంగారు. "కొమ్మని ఈయరె వెయ్యార్లిమ్మనెవొ దున్నంగ నేల యిట్టి మహాత్ముల్" ! అది నికూడా "సమ్మతితో శ్రీహరి కిచ్చి చెప్పె నీ బమ్మెర పోతరాజొకడు భాగవతంబు" అన్నాట్ట.

"అసలు విషయం అది అయ్యి ఉండదు."

"నాకు తెలియదు ! పలికెడిది భాగవతం. పలికించెడు వాడూ రామభద్రుడు. పలికిన భవహరం మరో కథలు పలకడం దేని కన్నాట్ట"

"ఐనా మనకేందుకే ! దొరసానులంగారు వచ్చేలోగా నేను ఆ గంధం తీయడం పూర్తి చెయ్యాలి పద పద కాలం మించిపోతోంది కార్యాలలాగే ఉన్నాయి."

"అహో ! మరచాను. కలభాషిణి నికుంజాలకు నీళ్ళు బోయాలన్నది మరచాను. నడు నడూ, ఆవల ప్రొద్దు జాగవుతుంది. ఏటూ పొదరింట దానితో పోరు తప్పదు." అంటూ తిరిగి ఎవరి పనుల్లోకి వారు వెళ్ళిపోయారు పరిచారికలు.

ఇక బయలుదేరిన పల్లకీ పోతనామాత్యుల వారి పర్ణ కుటీరం చేరింది.

అందలం యింటి ముందు ఆగగానే, భటులు వేగిరంవెళ్ళి దేవేరులంగారి ఆగమనం అమాత్యుల వారి అర్ధాంగికి విన్నవించారు.

ఆ మాట వినగానే పోతనా మాత్యుల భార్య దిగ్భ్రమ జెందారు. ఆ తర్వాత ఇది భ్రాంతి కాదు కదాని యోచించి ఆశ్చర్య పోయారు. ఆశ్చర్యంలో నుండి తేరుకొని, ఆతృతగా చిరుగుల చేలం సరిచేసుకొంటూ పయ్యదతో ఒంటినంతా కప్పుకొంటూ, గడప దాటి గబ గబా ఎదురు వెళ్ళి పల్లకీ ముందు నిలిచి మహారాణులంగారికి స్వాగతం పలుకుతున్నట్టు 'ఎంతటి అదృష్టం! లోనికి వచ్చి విడిది పావనం చేయండమ్మా!' అన్నారు.

ప్రభిణీమణి చిరు మందహాసంతో వేలు కలిపి పల్లకీ దిగి ఆమెతో పాటుగా మందంగా అందంగా నడిచి పర్ణశాల పంచలోనికివచ్చారు.

పోతనామాత్యుల అర్ధాంగం ఆదుర్దాగా లోనికి వెళ్ళి ముక్కాలు పీటమీద తాళపత్రాలను ప్రక్కనుంచి దానిని తెచ్చి, దేవేరులను అలంకరించ మన్నట్లుగా చూచి తిరిగి ప్రక్క వాటాలోనికి వెళ్ళి చిలికి చేసిన తామ్రంపు చెంబుతో నీరు తెచ్చి కంచు పళ్లెరం పాదాల ముందుంచి, పయ్యదను నడుముకు దోపు కుంది.

అంతా గమనిస్తున్న మహారాణులంగారు మెల్లగా సన్నగా సన్నాయి మీటినట్టుగా:

"అయ్యో! అమ్మణీ ! అంతటి మర్యాద లెందులకమ్మా! నీ యింట నేను మహారాణిని గానమ్మా! అమాత్య పదం అభిజాత్యం. పోతనామాత్యుల అర్ధాంగివి. నీ యెదుట నా ప్రభ్వీణిత్వం యేమిటి. కవి సార్వభౌముల అనుంగు చెల్లిలివి. ఏ విధంగా చూచినా పాదోదకం అందుకోవలసిందేగాని, అందించ డానికి కాదమ్మా! ఆఁ! దానికేమిటి గాని, రేపు మా పుట్టిన దినం. మీరంతా వచ్చి పాల్గొని మా సపర్యలంది ఆశీర్వదించమని కోరవచ్చాను. కవి పుంగవులు యింటలేరా?!" అన్నది.

"ఆఁ! హాలికులిలు చేరు వేళాయె నమ్మా! అదుగో మాటలోనే వస్తున్నారు." ఇంటి ముందు గంటల మోత వినిపించింది. మహారాణులంవారు తల త్రిప్పారు. పోతనా మాత్యుడు పంచలో నాగలినిదించి గంటలను నేలమీద ఉంచి, నందికేశులను ప్రక్క కట్టు కొయ్యలకు కట్టి బావి ప్రక్కనున్న గాబులోని నీటిలో కాళ్ళూ చేతులు ముఖం కడుక్కొని, నోటి నీరు పుక్కిలించి, ప్రక్కకు చూచి, తలపాగా దులిపి ముఖం తుడుచుకొంటూ పంచలోనికి వచ్చి దేవేరులను చూచి అలాగే నిలబడిపోయారు. ఈలోగా మహారాణులంగారు లేవడం. అప్రయత్నంగా రెండు హస్తాలు ఒకటి గావడం మస్తకం మర్యాద సూచకంగా వంగడం జరిగింది.

కవిగారి రెండు చేతులు పైకి లేచాయి. 'దీర్ఘసుమంగళీభవ. మహారాణులం గూర్చి విన్నాను. చాలా సంతోషం. నేడు కనులారాకన్నాను యశోదా దేవకీలలాముల లాగా. చిరకీర్తి నార్జించండి. ఈ నాడు మా యిల్లు పావనమైంది. ఆసీనువవ్వమ్మా !' అన్నారు.

ఆ మాటలకు దేవేరులు ఒళ్ళు పులకరించింది. మైగగుర్పాటు నందింది. రాముని గన్న శబరివలె, అనసూయనుగన్న జానకివలె అలాగే అలాగే నిలువు నిలువునా నిలిచి పోయింది ఏదో ఆనందం, ఏదో తృప్తి దానికి పదంలేదు. ఆ భావాన్ని అందిన ఆకాశానికి, ఆవేశానికి, ఆర్ద్రతకు ఏమనాలో తెలియని తృప్తి, తన్మయ భక్త్యావేశంలోనే ఉండిపోయింది. తన్ను తాను మరచిపోయిందామె: ఏమంటుందో తెలియకుండా, అచ్చ తెలుగు ఆడపడుచులాగా.

"చిన్న విన్నపం అన్నలంగారూ!" అంది. అది ఏలా అన్నదో ఎలా అనాలని అనిపించిందో ఆమెకే తెలియదు.

పోతనామాత్యులు తలనెత్తి చూచారు, ఏమిటన్నట్లుగా.

"రేపటి మా పుట్టినరోజు. అవ్వేడుకను దగ్గరుండి జరిపించి, తిలకించి ఆశీర్వదించగా..." మాట నోటిలోనే ఉంది.

"బాగుతల్లీ! చాలా మంచిది. మీ కోరిక నెరవేరుతుంది. కవి సార్వభౌముల చెల్లెలు మీకొద్దికగా నిలుస్తుంది. ఇంక నేనంటారా! అటు రామ కార్యం, ఇటు ఆయన కోడలి కార్యం నెరవేర్చాలికదమ్మా'" అన్నాడు పోతనామాత్యుడు చాలా మామూలుగా.

"కోడలు... కోడలు..." అవి యేదో అడగబోయారు మహారాణులంగారు.

"సరస్వతీదేవి. అదేనమ్మా! కావ్య రచనా వ్యవహారం."

ఆ తర్వాత మహారాణులంగారు, పోతనగారి వద్ద, ఆయన భార్య వద్ద శలవు దీసుకొని, పల్లకీ నధిరోహించారు. అందలం మెల్లగా మెల మెల్లగా సాగిపోయింది, ముందువెనుకలు పోటు భంట్లు కాపుతో.

దేవతార్చన గదిలో గామగనూనె చెక్క

వెలుగుతోంది. దాని వాసన మందంగా మత్తుగా నాల్గు వంకలకూ దూర దూరాలు గాలి పాయంతో సాగిపోతోంది.

పోతనామాత్యుడు తాటియాకుల మీద గంటంతో యేగో లోలోన అనుకుంటూ దాని వెలుగులో వ్రాస్తున్నాడు.

ఆయన కుమారుడు మల్లన ఆరుబైట మంచమ్మీద నిద్ర రాక అటూ యిటూ దొర్లుతున్నాడు

వంటగదిలో పోతనగారి భార్య పాత్రల సవో సర్దుతోంది

"అర్ధాంతరంగా ఆమె వచ్చి పిలిచింది. సరే అన్నారు... ఎలా వెళ్లడం?" అంది, అది అటు స్వగతంల, యిటు పోతనగారు వినాలనీ

పై మాటలు పోతనామాత్యులు విని కూడా ఆయన రాతపనిలో ఆయన పట్టించు కోలేదు గంటం ఆకులమీద గరగరసద్దు చేస్తూ జరిగిపోతోంది, ఆకులను నములుతున్నట్లుగా.

"ముగింపు కొచ్చాక కూడా ఈ తెగవరి తనం యేమిటి? ఎలా పంపాలని ఎలా వెళ్ళమనాలని? నలుగురో అవమానం అటు అలివిమాలిన గౌరవంతో అన్నగారు అందలాల మీద ఊరేగుతూ ఉత్సాహోటు, ఇటుఇక్కడేమో, ఆత్మాభిమానంతో హలంతో పొలం దున్ని గింజలు పిసుకి కిస్తూ గడ్డి తింటున్న గడ్డు తనం. మహారాజులంగారికి యెరుక పరచాలని కాకపోతే యేమిటి మానం?" అంది విసరుగా.

గంటం క్రిందబెట్టి చేతి వేళు మెటికిలు విరచుకొంటూ పోతనామత్యుడు భార్య వంక చూస్తూ,

"అమ్మీ! ఏమిటో అంటున్నట్టున్నావు" అన్నాడు

"ఆఁ! అనడానికేముంది? అన్నా వినడానికెవరున్నారు? మొగుడున్నాడు పరేసరి! మొనగాడున్నాడు కదా కన్నబిడ్డ. ఐనా! నా పిచ్చిగాని, చేసుకున్నవారికి చేసుకున్నంత. పూజకొంది ఫరుషుడు దానకొందికి బిడ్డలు అన్నారు కోరి నోములు నోచిన నాలాటి వారి కోరికలు కొంగకాని కొయ్యలుగాక తీరుతాయా? యేమిటి?" అంది అంతా అన్యాపదేశంగా జరిగిపోతోంది ఆమె వాలకం

మల్లన మంచంమీద లేచి కూర్చుని "అమ్మా! యింతకూ యేమిటీ? నీవనేది?" అన్నాడు ఆవలింతను అణచుకొంటూ

"ఆఁ! అదీ వరస! రామాయణం అంతా విని రాముడికి సీత యేమవుతుంది? అన్నాట్ట వెనకటికి ఇంతదాకా కంచంలో అన్నంవడ్డిస్తూ నేను చెప్పినదంతా యేమిటి? మంచంలో నడుంవాల్చి, మళ్లీ మొదలడుగుతున్నావు. అవునులే మల్లన్నా! నాన్నకు తగ్గ కుమారుడివి" అంది

"చెప్పాను కదమ్మా! వెళ్ళడం మానేస్తే సరిపోలేదా అని అసలు మామయ్య మనను అవమానించాలనే ఈ పన్నుగడ పన్నాడు, ఆయన మాట కాదన్నామని, కృతి తిరస్కరించామని, యిలా వీళ్ళను అవమానించాలాని చూస్తున్నాడు అదను దొరకింది ఆహ్వానం పేరుతో నలుగురిలో మన లేమిని చూపి నగుబాటు జేయాలని అదీ ఆయన ఎత్తు" అన్నాడు

"అమ్మీ! నీకు వెళ్ళాలని ఉందా?" అని అడిగాడు పోతన రెండు చేతుల వేళు ఒకసారి వంచి చూచుకొని.

"ఇది మరీ బావుంది వెళ్ళాలని వుందా? ఆడదానిని కాదా? అంతఃపురాలలో తిరగాలని అందలాలు యెక్కాలని కోరికలు తీరవు చంపుకుంటాం! అన్నగారు అందించిన అవకాశం అందరిలా అందచందాలు చూడాలని సంబరాలు తిలకించాలని, నలుగురాడంగుల్లో మసలాలని, అన్నగారి గౌరవ మర్యాదలు

# ఆంధ్రప్రదేశ్
# అవతరణ
# రజతోత్సవాలు



శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధానమంత్రి

## అన్ని రంగాలలో అగ్రగాములు
## మన తెలుగు రైతులు



శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

★ కష్టించి పని చేయడానికి, ఆధునిక పద్ధతుల అనుసరించడానికి ప్రఖ్యాతి గాంచిన తెలుగు రైతులు గత 25 సంవత్సరాల కాలంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి రంగంలో అమోఘమైన కృషి చేసి, "దక్షిణాది ధాన్యాగారం" అనే మన రాష్ట్రం ఖ్యాతిని ఇనుమడింపజేశారు.

★ తుఫానులు, వరదలు, దుర్భిక్షం వంటి ప్రకృతి వైపరీత్యాలను మొక్కవోని ధైర్యంతో ఎదుర్కొని అధికాహారోత్పత్తిని సాధించడంలో మన రైతులు విజయం పొందారు 1956-57లో 59.17 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తి కాగా, 1978-79లో 106.7 లక్షల టన్నులు ఉత్పత్తి అయ్యాయి. సగటున 100 లక్షల టన్నుల ఆహారోత్పత్తిని సాధిస్తున్నారు.

★ వాణిజ్య పంటల విషయంలో కూడ మన రాష్ట్రం గణనీయమైన పురోభివృద్ధిని సాధించింది. ఉదాహరణకు ప్రత్తి ఉత్పత్తి 1.37 లక్షల బేళ్ళ నుంచి 4.56 లక్షల బేళ్ళకు, మెస్తాపంట 4.78 లక్షల బేళ్ళ నుంచి 9.28 లక్షల బేళ్ళకు పెరిగింది.

★ బ్రహ్మాండమైన భారీ నీటిపారుదల ప్రాజెక్టుల ద్వారా నీటి పారుదల సౌకర్యం కల్పనలో గమనార్హమైన ప్రగతిని సాధించారు. నీటి పారుదల సౌకర్యం పొందిన భూమి విస్తీర్ణం 28.20 లక్షల హెక్టార్ల నుంచి 36.6 లక్షల హెక్టార్లకు పెరిగింది

★ సకాలంలో పరపతి సౌకర్యాలు అందజేయడంతో అధికాహారోత్పత్తి సాధ్యమైంది. 1967-68లో రు. 9.43 లక్షల రుణాలు రైతులకు పంపిణీ చేయబడగా గత సంవత్సరం రు. 15 కోట్లు రుణాలు యిచ్చారు.

★ గత ఒక సంవత్సరంలో రైతులకు అనేక ప్రోత్సాహకాలను లభింపజేశారు. వాటిలో 5 ఎకరాల మాగాణి, లేదా 10 ఎకరాల మెట్టగల రైతులను భూమిశిస్తు చెల్లింపునుంచి మినహాయింపు, పంటల భీమా పథకం, కనీస దిగుబడి హామీ పథకం, కరువు, వరద బాధిత ప్రాంతాలలో బకాయీల రద్దు మొదలైనవి ఉన్నాయి.

**ఆంధ్రప్రదేశ్‌లో గతంలో పొందిన అనుభవాలతో తెలుగు రైతులకు ఉజ్వల భవిష్యత్తు కలిగిస్తూ ముందడుగు వేస్తున్నాం.** Advt No 52

సమాచార పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No. 21539/Advt/C1-3/81





## దేవతా వస్త్రాలు

కళ్ళారా చూడాలనిపించు ఉందా? ఆడ పుట్టుకకు కట్టుకున్నవారి సంచిలో లేక పోయినాపుట్టింటివారి ముచ్చటలు...'' అంది.

''మంచిది. అంతేకదా? వెళ్ళాలిని ఉంది. అంటావు'' అన్నాడు, పోతన.

''ఆఁ! ఈ చీని చీనాంబరాలు, కాశ్మీర శాలువలు కప్పుకొని అంతఃపుర కాంతల మధ్య మసలటం, అన్నంత తేలిక కాదు. హంసల్లో కాకిలా తిరిగి రమ్మంటారా? తగుదునమ్మా యని!''

మంచంలోని మల్లన ''అదేమిటమ్మా! మనకున్నది మనం కట్టుకొని వెళతాం''

''అంతేలే!''

''అమ్మీ! ఇంతకు నీవనేది యేమిటో స్పష్టంగా చెప్పు'' అన్నాడు పోతన మధ్యలో.

''అనేదేముంది? నగలూ, మాన్యాలూ, మాణిక్యాలూ అడిగానా? అడిగితే తీర్చేట్లు'' అంది

''సరేలే అమ్మీ! వెళుదువుగాని. ఏ కొరతా లేకుండా నలుగురులో సమానంగా, మర్యాదగా మసలి వదువుగాని. మీ అన్నగారి గురు గౌరవం తరగకుండా పోయి వద్దువుగాని. నీ వన్నట్టు ఏ కోరిక కోరావు గనక. కాపురానికి వచ్చిన దాది కోరిన కోరిక యిదొక్కటేకదా తీర్చుకొందువుగాని కొదువ లేకుండా. సరేనా'' అన్నాడు పోతన ఒక నిర్ణయానికి వచ్చినట్లు.

''ఆఁ! ఆఁ! ఏమున్నదని? రేయి గడవగానే ఆకసం నుండి ఊడి పడతాయా? జలతారు పట్టుపుట్టాలు. ఏమిటో అంతా అయో మయం'' అంటూ సయ్యదతో చాపమ దులిపి దానిమీదనే నడుం వాల్చింది పోతనగారి పాదాల దగ్గర

''సరే! నిద్దుర కూరు, ఉదయం ఆలో చిద్దాం'' అని తిరిగి గంటం అందుకొని రాయడం సాగించారు. నోటిలో మననం చేయ సాగారు రాస్తూ—

ఘనుడా! భూసుర .. ఘనుడా భూసుర డేగెనో. ఆఁ... నడుమ...నడుమ...అంటూ పద్యం గరగరా తెగిపోతోంది ఆకుమీద ...

ఆమె వింటూ ఆవులించింది. ఆయన అలాగే రాస్తున్నాడు. మల్లన గురక ఆయనే ఆకుల మీద రాసే సవ్వడికి లయగా ఉంది ఆ సద్దు దూర దూరాలకు గాలి సాయంతో ప్రయాణిస్తోంది.

తెల వారింది, కోళ్ళు కూసాయి.

*　*　*

ప్రొద్దు బారెడుకు పైగా ఎగప్రాకింది. పోతనామాత్యుల పర్ణకుటీరం ముందు, శింగ భూపాలురంగారి ముత్యాల పల్లకీ దించబడి ఉంది బోయీలు పంచలో విశ్రాంతిగా కూర్చుని ఏవో సొదు పోక కబుర్లాడు కొంటున్నారు.

బల్లాలు పట్టుకొని యిద్దరు భటులు వాకిలిలో నిలబడి ఉన్నారు

లోపలి గదిలో కవిగారి అర్ధాంగం కాలు కాలిన పిల్లిలా అటూయిటు నిల్వలేక కూర్చో లేక - ఏమీ పాలుపోక, ఆరాటంతో తిరుగాడ సాగింది

ఆమెకు ఆ క్షణం బిగ్గరగా యేడుద్దామా! అనిపించింది. ఎవరినైనా తిడదామా ? లేక కొడదామా ? ఇంకేదేనా చేద్దామా ? అనిపిస్తోంది — ఏంచేయాలో తోచడంలేదు. ఏం చేద్దామన్నా పాలుపోడంలేదు

అటూయిటూ యిటూఅటూ ఇంటిలోనే తిరుగాడ సాగింది. ఎంత యిల్లు ? నాలు గడుగులు వేస్తే ఈ గోడ తగులుతుంది. అటు నాలుగడుగులు వేస్తే ఆ గోడ అడ్డు వస్తోంది. ఆమెకు అంతా అయోమయంగా ఉంది.

అంతలో ఆమెకు ద్వారంలో నుండి దూరంగా వార్త అందుకొని వస్తోన్న పోతనామాత్యుల కనిపించారు

ఆయన కంటపడగానే " నడవరేం ? " అనిపించింది

ఏన్నడిచి ఏంవచ్చినా చేయి గలిగింది యేమిటి ? వచ్చి యేంచేస్తారు ? వాళ్లను వెళి రమ్మంటారు అంతేగా ? పోనీలే అదేనా కాని ఏదో నిరాశ ఏదో ఆశ ఏదో తెలియని ఆవేశం కలుగుతున్నాయి.

ఆయన రావడంచూచిన భటులు అటూ యిటూ తత్తరంగా అదిగో ఒస్తున్నారు, అని తారట్లాడారు.

పల్లకీ బోయీలు ఒక్కసారి ఒళ్ళు విరుచుకొని లేచి నిలచారు.

పోతనామాత్యులు ప్రక్కనున్న బావిలోని నీరు చేదుకొని కాళ్ళు ముఖం కడుక్కొని లోనికివస్తూ పంచలోఉన్న భటులను చూచి, "ఎంతసేపయ్యింది ? నాయనా ! వచ్చి" అన్నారు.

"ఆఁ! ఆఁ!' అని యేదో చెప్పబోయారు!

అందులపు బోయీలో "వేంవచ్చామనే మీకు వార్త నంపాం బాబుగారూ !"అన్నాడు ఒకడు

"అహా" అంటూ లోనికి వెళ్ళారు పోతనగారు.

కవిగారి అర్ధాంగం ఆగ్రహంగా ఆర్ద్రంగా చేతకాని తనమంతా ముఖంలో మాటల్లో పూర్తిగా నింపి "ఇప్పుడేంచేసేట్టు ? అందలం వచ్చి ఇంటిముందాగింది" అన్నది

"వెళ్లడానికాయత్తమైనట్లేగా" అన్నాడు పోతనగారు నింపాదిగా, నిదానంగా ఏదో అంటున్నట్టు!

"ఏం చూచుకొని ? ఏముందని ? ఈ చిరుగుపాతలతో..." అని యింకా యేదో అన బోయింది.

పోతన నిర్వికారంగా నిశ్చలంగా పెదవుల మీద చిరునవ్వు లొలికిస్తూ "అమ్మీ! ఎందుకే అంత ఆవేశపడతావు? ఆ తాళపత్ర గ్రంధా లుంచే మందసంలో నీక్కావలసిన వస్త్రీ ఉన్నాయి. అలంకరించుకొని బయలుదేరు. నేను పొలం వెళ్లేప్పుడు చెప్పి వెళదామని అనుకుంటూనే ఏదో ఆలోచనలో చెప్పకుండా వెళ్ళిపోయాను వెళ్ళు అలంకరించుకో. పల్లకి వచ్చి తడవైనట్టుగా ఉంది. నీవు అక్కడకు అపరాహ్ణానికి ముందే చేరతావులే" అన్నాడు ఏదో! ఎవరికో! ఏమిటో చెపుతు న్నట్టు! ఏమీ తొణక్కుండా!

ఆమె ఆత్రంగా దేవతార్చన గదిలోకి వెళ్ళి కావడి పెట్టె తెరిచింది అంతే! ప్రాణంలా బొమ్మలా మారిపోయింది. నోట మాట రాలేదు ఏమండీ ! అందామనుకొంది ఆనం దంలో అనలేక పోయింది. "ఇదిగో!" అని పిలుద్దామనుకొంది. కంఠం గాద్గదికమై పోయింది పరవశంతో చిందులు వేద్దామ అనిపించింది. శరీరం పారవశ్యంతో వశందప్ పోయింది

చందువాపెట్టెలోని సారెచీరెలన్నీ కోక లెలికి తీసింది కళ్ళు జిగేలుమన్నాయి. వాటి ఏం చేయాలో తోచడంలేదు. ఎలా అలం రించుకోవాలో పాలుపోకుంది గాదు ఆమెక తెలియకుండానే నగలు, చీరెలూ వెలికి తీ ఒకోటి ప్రక్కనుంచింది ఆ పెట్టెలో అన్ని వుంటాయనిగాని ఉండొచ్చనిగాని ఉండడాని వీలుందానిగాని అన్ని అందులో ఎలా ఇమి ఉన్నాయనిగాని ఆమె ఊహకు రాలేదు. ఆశ యంగా లీసి నకోలది వస్తున్నాయి.

అలాగే పాలుపోని స్థితిలోనే ఉండి అ యత్నంగా "ఒకసారి ఇలా వస్తారా?" అది అనాలని అన్నానని అనుకొంది గొంతునుండి ఆ పలుకులు వెలికి నిజంగా రాలేదు క్షణం చూచింది ఈసారి బాగా ఒళ్ళు తెలిసి లోకంలోకి వచ్చి "ఇదిగో మిమ్మల్నే ఒకసారిలా ఒస్తారా?" అంది.

అది పోతనగారికి వినిపించింది. ఆయన అక్కడనే "అమ్మీ ! పిలిచావా?" అన్నాడు.

"ఆఁ!"అన్నదామె యధాస్థితికి వచ్చింది. ఆయన రాగానే చాలా అడగాలనుకుంది.

పోతనామాత్యులు లోనికివచ్చారు. గదంతా చీరెలతో నగలతో నిండి ఉంది

అన్నీచూచి అంతాగ్రహించి "ఇంకా అలాగే ఉన్నావేం అమ్మీ ! త్వరగా తెమిలిరా !" అన్నాడు అప్పుడు కూడా ఆయన ముఖంలో ప్రశాంతత అలాగే ఉంది ఆ ముఖంలోకి చూస్తూ ఏమనాలో పాలుపోక, "ఇవన్నీ ...



ఇవన్ని, ... అలంకరించుకోడానికి, చేతకాలేద నాలా ? విక్కడివనాలా? ఎలావచ్చాయనాలా ? ఏడువారాల నగలూ చీని చీనాంబరాలు, కంచుకాలు, ఎన్ని తీసినా తరగని, ఈ సరంజామా ఏమిటనాలా ? అసలు వాటిని విప్పుడైనా చూచిందా ఆమె మాత్రంగాదు విచ్వరైనా విప్పుడు చూచారు విక్కడ చూచారు. కనీసం కట్టుకొని పెట్టుకున్న వారినైనా చూచి వుంటారా ?'' అలాగే ఏమనాలో ఏమడగాలో లోచక నిలువు గ్రుడ్లతో నిల్చబడింది.

ఆయన గ్రహించాడు. ''అమ్మీ ! త్వరగా అలంకరించుకొని ప్రయాణంగా, వేళ మారుతున్నది'' అన్నాడు.

'ఏవి ? యెలా ? అలంకరించుకోవాలో తెలియడంలేదండీ !'' అంది ఆ మాటలో తన చేతగానితనం స్పష్టంగా నెలితి మాటల్లో అంతకన్నా ఎలా చెప్పాలో తెలియక

పోతన తల నూపి ''నీ యిష్టం వచ్చినట్టు అలంకరించుకో. ఏవి కావాలో వాటిని ధరించు అమ్మీ !'' అన్నాడు

''బాగుంది. ఏది యెక్కడ అమర్చు కోవాలో నాకు తెలిస్తేకదూ ఏవి కాళ్ళకో ఏవి చేతులకో, ఏది యేదో తెలియడంలేదే!'' అంది దీనంగా !

పోతనామాత్యుడే – చేతికందిన చీరె అందుకొని కట్టబెట్టి కంచుకం తొడిగి – అందిన నగను అందినట్టు అలంకరించాడు. ఆ అలంకరణ సర్వపదప్రౌఢవ్యాకరణాలంకారచందః శాస్త్రంలా సర్వాలంకార శోభితంగా ఉంది.

ఆమె నమ్రనుండి వెత్తని పాదాలవరకూ: అందాలు సందాలు చేసుకొని చిందులు త్రొక్కాయి. అందెల రవళిలో: ఆయన అన్నీ అలంకరించి ఒక్కసారి క్రింది నుండి పైదాకా చూచి, తృప్తిగా తలయూచి, ''వెళ్ళిరా ! అమ్మీ ! ఏ రాజవంగడంలోని పడతికి తీసిపోవు నీ అన్న గురుగౌరవం – పేరోలగంలో ఇనుమడిస్తుంది, వెళ్ళిరా ! అమ్మీ !'' ఒక్క మాట అన్నాడు. ఆమె ఒక్కసారి రాజసంగా చూచింది. పోతనామాత్యులు ఆమె కన్నుల లోనికి చూడలేకపోయినాడు. ఏదో శక్తి అనంత గుప్తమైనది దీప్తమైనది – గోచరించింది.

''అంతఃపురాంగనల మంతనాలు పట్టించుకోకు. నీ కన్నుల్లోనే తెలుస్తుంది, రాచరికం. రచ్చకెక్కాక కచ్చదారే ఉచ్చరించే విధాయకం నేర్పుతాయని. శుభం కలుగుతుంది వెళ్ళిరా అమ్మీ వెళ్ళిరా– వేళ మారుతుంది.'' అని మెల్లగా ఆ గదిని దాటించి వెలుపలకి నడిపించాడు

ఆమె ఒకో అడుగు వేస్తోంది, పల్లకీ వంకకు ఈ బెల పోటుగాళ్ళు – ఆమెను చూడలేకపోతున్నారు చూస్తున్నారు. వారికి ఏదో భయం-భక్తి గౌరవం ఆ మూడింటికి అతీతమైనదేదో కలుగుతోంది అంతా తెలుస్తుంది ఏమీ తెలియడంలేదు అందలం యెత్తుకున్నారు బోయీలు. మెల్లగా మెల్లగా అలా అలా గాలిలో తేలిపోతున్నట్టు పల్లకీ తేలిపోతోంది. బోయీలకు మేనాను మోస్తున్నట్టుగాలేదు, వెంట వస్తున్న రాజభటులకు

> **భేదం**
>
> రవి ఉంటేనే వెలుగు
> లేకుంటే చీకటుగు
> కవి ఉన్నా, లేకున్నా
> ఆతని కవితే
> కొండంత వెలుగు
>
> – ఆదిభట్ల రామప్రసాద్

గూడానడుస్తున్నట్టుగా అనిపించలేదు. పల్లకీ ఓరుగల్లు బాట దాటింది–

*　　　*　　　*

రాజధాని నగరమంతా అలంకరించి ఉంది. సర్వజ్ఞరావు సింగభూపాలుంగారు, ఉప్పరిగ మీద, నిలచి ఉన్నారు. వారి ప్రక్కన కవి సార్వభౌములు – నిలచి నగరు సౌరు పరికిస్తున్నారు. నగరు అంతఃపురం రాజప్రసాదమంతా వచ్చేవారు, పోయేవారితో సందడి సందడిగా ఉంది. కానుకలందించేవారు, ఆశీర్వదించేవారు కామకలు తీసుకొని వెళ్ళేవారుగా, ఉన్నారు. విందులూ వినోద భాషణలు రకరకాలైన మనుష్యులు, వారి వారి అలంకరణలు, విలాసినీ మణులు, వారి సోయగాలూ వాటిని చూచేవారు, వేడుకలు చేసేవారు వాటిని చూచేవారుగా సందడిగా సంబరంగా ఉంది.

నగరు వాకిట పల్లకీ ఆగింది. చాలా మంది చూపులు అందలంలో అందులోనూ రాజప్రాసాదానిదా అందలం అందులోనుండి ఎవరు దిగుతున్నారా ! అని ఆశ్చర్యంగానే చూచారు వారి ఆశ్చర్యం ఆశ్చర్యంగాక ఏమిటి ?! ఎవరు ?! ఆ పల్లకీలో నుండి ఆ విద్యుత్తేజం ఎవ్వరిదీ ? చూడగలుగుతున్నారు చూడాలనిపిస్తుంది, చూడలేక పోతున్నారు చూచినవారు చూచినట్టుగా అలాగే బొమ్మల్లా నోటమాట రాక ఉండిపోయారు. స్తంభించిపోయారు పోతనామాత్యుల వారి అర్ధాంగి మెల్లగా పల్లకీ దిగి, అటూ యిటూ పరకాయించి చూచారు పరిచారికలు పరుగు పరుగున వచ్చారు. నమ్రతగా నిలచిపోయారు ఆమె వంక అలా చూచి. నిస్తేజంగా దారి చూపారు ఆమె మెల్లగా అటు అడుగులు వేశారు సరిగ్గా ఈ దృశ్యాన్నే మందిరోపరితలం మీద ఉన్న శ్రీ సింగ భూపాలురు గూడా చూశారు. కనులు నులుముకున్నారు తిరిగి మరొకసారి చూచారు మళ్ళీ చూచారు ఊరక ఆయన మహారాజన్న విషయం మరచి ఆశ్చర్యంగా చూచారు

కవిసార్వభౌములు కూడా దాదాపు అదే స్థితిలో ఉన్నారు ఒక్కసారే ఒకరి వంక కొకరు చూచుకున్నారు. సింగభూపాలురుంగారే ''సార్వభౌమా ! ఆ అందలం దిగి మందిరం లోనికి పోతున్నది...'' ఆ తర్వాత ఏమనాలో ఆయనకు పాలుపోక మాట నంతటితో తుంచి వేశారు.

ఆలోచనాలోకం నుండి వెలికివచ్చినట్టుగా కవిసార్వభౌములు చిరునవ్వు నవ్వుతూ : ''మహాప్రభూ ! మా బావగారి జాణతనం. అహో అయన అందలేదు బాలరసాల సాలనవ పల్లవ కోమల కావ్య కన్యకను ప్రౌఢను చేసి మనముందుంచారు, తిలకించమని. ఆమె మా చెల్లాయమ్మే ! కానీ కానీ...ఏం చెప్పను. అలి నీలాలక పూర్ణచంద్రముఖి నేణాక్షి పవాళ ధర కలకంఠ నవపల్లవాంఘ్రియుగళ కంరేభ కుంభస్తనీ నిభేంద్రయానవరుణాంభోజాహస్త మహోత్పలగంధ మృగరాజ మధ్యమ వరవరా నేను భ్రాంతిలోనో విభ్రాంతిలోనో పారవశ్యం లోనో పరవశంలోనో విలా ఏం చూస్తున్నానో ప్రభూ! ఆమెను చూస్తున్న వాలో...''

''అందుకేఅడుగుతున్నాను. ఆమె పోతనామాత్యుల భార్య, మీ చెల్లెలు ఆమెయే కదా?''

''ఆమె పోతనామాత్యుల అర్ధాంగమే కానీ! ఆ తేజోపుంజి పుంజామరుణి వడుమ, అకర కంకణ విక్వాణ రవళుల శబ్దంలో

ఆనీల కభరీభరచ్ఛాయ నా కన్నులు కప్పి వేసిందే అహో బావా తపోధనా పోతనా ’’ శ్రీనాధుడింకా ఆశ్చర్యంలో పారవశ్యంలోనే ఉన్నాడు

సింగభూపాలులంగారు ‘‘కవీశ్వరా! మీ భావ సాధారణ హాలికుడు ఇంతటి మహదైశ్వర్యవంతులు ధరించలేని రాని ఆ నగలు కచ్చడాలు...’’ మాట పూర్తి కాకుండానే,

‘‘మహాప్రభూ! ఆయన తపోధనంలో ఇవి యే పాటివంతు? రండి ప్రభూ అటుగా వెళ్లి దాపునుండి పరికించి పరిశీలించి, ఊహ కందుతాడేమో..’’ అంటూ ఇద్దరూ మందిరోపరితలం నుండి క్రిందికి దిగసాగారు.

ఆమె అందలం దిగి మంద మందంగా మందయానలా మత్తేభంలా అందంగా నడచి లోనికి సాగింది

పరివారికా జనానికి ఆమె వెంట నడవాలని వుంది. ఎందుకో భయంగా బెరుగ్గా సంకోచంగా ఉంది అది భయమా? కాదు! అందరి డెందాలో నూ ఏదో ఊహా హర్మ్యాల నుండి దిగివస్తున్న భావన కలుగుతుంది. అంతా ఆమెను చూస్తూనే ఉన్నారు చూడలేక పోతున్నారు. దాపుకు రావాలని ఆమెను పలుకరించి మీకేం కావాలని అడగాలని, అందరికీ కలుగుతుంది ఆమె యేదైనా అడుగుతుందేమో అందిద్దాం! ఆమె ఏపని చెప్తుందో వెంటనే చేద్దాం అన్న భావం అందరిలోనూ కూడకట్టుకొని గూడుకట్టుకొని ఉంది. ఆమె ఎవ్వరికీ ఏమీ చెప్పలేదు. ఏమీ అడుగలేదు. నడుస్తూంది. వారంతా ఆమె వెంట వస్తున్నారు.

సింగభూపాలుంగారి దేవేరులుండే తావుకు వెళ్ళిందామె. ఆమె యీామెను చూచింది. ఏదో తెలియని పరవశం భక్తి–గౌరవంకలుగుతున్నాయి ఆమె యింట ఆమెను చూచినప్పుడు పోతనామాత్యుల భార్య శ్రీనాధకవి సార్వభౌముల చెల్లెలు అన్నదే. యిప్పుడు! ఇప్పుడు అదికాదు. మరియేది? యేదో! ఆమె మాత్రం పోతనామాత్యుల భార్యే! కానీ ఆ తేజస్సు ఆ నడక, ఆ నడకలోని ఠీవి. ఆ రాజసం అలనాడు లేదు, నిన్న పిల్చబోయి వచ్చినప్పుడు కూడాలేదు. పర్ణశాలలోనూ; అంతఃపురంలోనూ ఆమె రూపు రేఖలు మారిపోయాయా! ఉండే చోటును బట్టి ఆమె రూపం మారుతుందా. ఏవేవో ఊహలు వస్తున్నాయి అలాగేమెల్లగావెళ్లి చేయూత యిద్దాం అనుకుంది ఎందుకో సంకోచం సందేహం కలిగింది పోతనామాత్యుల అర్ధాంగే చేయి అందిపుచ్చుకుంది. ఆమె కాచేయి తగులగానే ఒడలంతా ఏదో పులకరింపు ఏదో పారవశ్యం తనంత వారు లేరన్న అభిజాత్యం కలిగింది సింగభూపాలురంగారి భార్యామణికి

ఆ వేలు నందుకొని మెల్లగా ఒక ఉన్నతాసనం మీద కూర్చోపెట్టింది.

అంతలో దాసదాసీజనం పన్నీరుతెచ్చారు పసిడి పళ్లెరం తెచ్చారు! ఆమె ముందుంచారు సింగభూపాలమౌళి అర్ధాంగం దాసీలు పన్నీరు పోస్తుండగా ఆమెపాదాలు కడుగుతూ ఆ మంజీరాలు, ఆ కాలి అందెలు, ఆ కాలి పసిడి పావడాలు చూచి ఏమనాలో అని ఎలాంటివో ఏమో, అలాంటిని ఉంటాయా అన్న ఆలోచనలోనే ఉండి కాళ్లు కడుగుతుండగా,

శ్రీనాధ సార్వభౌముడు శింగభూపాలురంగారు జంటగా వచ్చి ఆ దృశ్యం చూస్తూ వారి కనులు పావనమైనట్లుగా భావన కలిగింది. శ్రీనాధుని పెదవులు అప్రయత్నంగా

‘‘పాల కడలి పాదాలు తడుప
పవ్వళించిన వాని
పాదాల నొత్తు పడతి పాదాలు
కడుగు భాగ్యమ్ము నీకె కలిగెనమ్మ!’’

అన్నాడు.

వింటున్న సింగభూపాలురు తన భార్యకెంతటి భాగ్యం కలిగింది!? అన్న ఊహేగాని సామాన్యకవిభార్య పాదాలు నా పట్టమహిషి పట్టుకుందే! అన్న ఆలోచనేరాలేదు ఆయనకు ఆ క్షణం!

చుట్టూ వున్నవారు చూడ్డమేగాని వారికి ఏ యితర ఆలోచనా రాలేదు.

ఎందుకో తన చెల్లెలిని చూస్తుంటే భయం భక్తి. ఏమిటిది? ఏమవుతుంది? ఇది ఎలా సంభవం? అసలు ఇక్కడ యిప్పుడు ఏం జరుగుతుందన్న ఆలోచనలోనే గడిపి వుండబట్టలేక ‘‘అమ్మాయా! బావగారు భాగవతం ఏ ఘట్టం రాస్తున్నారే!?’’ అని అడిగాడు.

ఆమె మెల్లగా తలెత్తి, నే నంతగా పట్టించుకోలేదు గాని అన్నయ్యా, రాతి వారి పాదాల దగ్గర కొంగు పరచుకొంటుండగా! రుక్మిణీ కళ్యాణంలోనిదే అనుకుంటా ‘ఘనుడా భూసురు డేగెనో నడుమ... నడుమ – అదేమిటమ్మా! – ఆదే – అది. ఆ మార్గశ్రాంతుడై చిక్కెనో!’’ అని మననంచేస్తూ రాస్తున్నారు’’ అంది

వింటున్న శ్రీనాధుని ఒడలు పులకరించి ‘‘ధన్యోస్మి – అమ్మా! ధన్యోస్మి! చెల్లి! ధన్యోస్మి’’ అన్నాడు

ప్రక్కనేఉన్న సింగభూపాల భూకాంతుడు ఏదో తెలిసినట్లు తిరిగి తెలియనట్లు ‘‘ఏమిటి? సార్వభౌమా! మీలోమీరే పారవశ్యమొందుతున్నారు?’’ అని అడిగారు

‘‘లోకంలోని ప్రాణికోటిలో ఎందరి కందుతుంది ప్రభూ ఈ అదృష్టం, ఈ అవకాశం – నేను మందిరోపరితలం నుండి దిగుతూనే కొందలమందాను ఇప్పుడిప్పుడే, తేరుకొని ఈ జడ జగత్తులోనికి నారకాయరంగంలోనికి వస్తున్నాను. ఆ: అన్నట్లు – అమ్మా! మహారాణీ! మా చెల్లాయమ్మను, వేగిరం యిల్లు చేర్చే ఏర్పాట్లు చేయండి ఎంత శ్రీఘ్రంగా వెళితే అంత వైళము మా బావగారు



ఆవలిఘట్టంలోని కాయత్తి పహారాలు''
అన్నాడు శ్రీనాథ కవిసార్వభౌముడు అయనకు ఒకవంక ఆనందం, ఒకవంక తృప్తి, ఒకవంక యేదో తెలియని ఆవేశం కలుగుతూ ఉంది.

"అదేమి? కవిగారూ! రాక రాక మాపాలికి విచ్చేసిన మీ చెలి లిగారిని యింత వైశమ అనుపమని ఆలోశిస్తున్నారు, ఇది భావ్యమా?" అని అడిగింది మహారాణి.

"అమ్మా! మీకు తెలియదు ఆమె కందిం చాలమకున్న లాంఛనాలు అందించండి. ఆమె యిక్కడ ఉండడంవల్ల మీకు మి కార్యాలేమి సాగవు. విన్నరూ వారి వారి కర్యాలను సక్రమంగా నిర్వర్తించేరు. ఆమె యిక్కడ ఉండడంవల్ల అక్కడ మా బావగారు రామ నామం జపిస్తూ ఊరక యెదురుచూస్తూ ఉంటారు. గంటం ఆకు మీద అకరం విదిలించడానికి వీలు లెదు."

"అదేమి? మహాశయా!" అన్నారు దేవేరులు.

## దేవతా వస్త్రాలు

"అంతే మహారాణీ! చెల్లాయి ధరించి వచ్చిన ఆభరణాలు అలంకారాలు, రుక్మిణీ అమ్మవారు పెళ్ళికిపోతూ అలంకరించుకోవల సినవి. ఆహా! బావా! నీ వెంతటి మహా సాధకుడవు మహా ఋషివయ్యా, మహా శక్తివంతమైన తాపసివి. మహానుభావుడవు. సాధకుడవు."

"మహాకవీ! మీరంటున్నదీ మీ భావావేశం మాకు అర్థం కావటం లేదు" అన్నారు సింగభూపాలంగారు.

"నిజమేమహాప్రభూ! ఇలాంటి సంఘటన ఇలాంటి వస్త్రాల సీయడం, తొల్లి త్రేతా యుగంలో అత్రి ఆశ్రమంలో అనసూయాదేవి సీతామహాలక్ష్మికి తన తపస్సుతో సాధనా శక్తితో నారబట్టలు సృష్టించి యిచ్చింది అవి కట్టుకొనే వనవాసం చేసిందామె. ఇప్పుడు మా బావ నా చెలెలికి కళ్యాణ వస్త్రాలు, ఈ దేవతా వస్త్రాలు ఇచ్చాడు. అవి యిచ్చే భాగ్యం, వాటిని ధరించే భాగ్యం అందరికీ అందదు" అన్నాడు శ్రీనాథుడు.

మహాకవులేదో అంటున్నాగని అంతా వింటూ వున్నారు ఆ తర్వాత సర్వజ్ఞ రావు సింగమహీపాలరంగారు శ్రీనాథ కవిసార్వభౌములతో మెల్లగా అన్నారు –

"ఇంక భాగవతం సరాంకితం నాకు అంకితం కావడం..."

"లేదు మహాప్రభూ!
పలికెడిది భాగవతం
పలికించెడు వాడు రామభద్రుండట
పలికిన భవహరమగు
పలుకను వేరొండుగాథ– పలకగనేలా"

ఆ తర్వాత అందలం అందంగా మందంగా రాజమర్యాదలతో ఒంటిమెట్ట బాట సాగి పోయింది రాజ మందిరం అంతా వాకిట నిలచి చూస్తూ వుంది.



# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

### రాఘవ పేరుతో ఆడిటోరియం :

విశ్వవిఖ్యాత నటుడు బళ్లారి రాఘవ పేర నగరములో ఒక ఆడిటోరియం నిర్మించాలని రాష్ట్ర సాంస్కృతిక శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి అక్టోబర్ 31 న రవీంద్ర భారతిలో రాఘవ సంస్మరణ తపాలా బిళ్ల ఆవిష్కరణ సందర్భంలో అధ్యక్ష పీటం నుంచి ప్రకటించారు. ఈ ఆడిటోరియంకు 15 లక్షల రూపాయలు ఖర్చవుతుందని, రాష్ట్ర ప్రభుత్వం దీనికై ఇదివరకే నాలుగు లక్షల రూపాయలు కేటాయించిందని ఆయన తెలిపారు. ఈ ఆడిటోరియం రాఘవ శతజయంతి పూర్తి నాటికి పూర్తవుతుందని శ్రీ శ్రీరామమూర్తి తెలిపారు. బమ్మెర పోతన పంచవింశ శతవార్షికోత్సవం సందర్భంగా పోతన స్మారక తపాలా బిళ్ళను విడుదలచేయవలసిందని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరిందని, ఈ విషయమై విదేశాంగ మంత్రి శ్రీ పి.వి. నరసింహారావుతోను తాను చర్చలు జరిపానని ఆయన తెలియజేశారు. రాఘవ శతజయంతి స్మారక తపాలాబిళ్లను రాష్ట్ర న్యాయ శాఖామంత్రి శ్రీ ఇ. అయ్యపురెడ్డి విడుదల చేస్తూ, స్వర్గీయ రాఘవ మహా నటుడే గాక, గొప్ప న్యాయవాది అని, తాము విద్యార్థిగా ఉన్నప్పుడు కళాశాల నిర్వాహకులతో విద్యార్థులకు కలిగిన ఒక వ్యవహారంలో ఆయన వాదించి విద్యార్థులను గెలిపించినారని శ్రీ అయ్యపురెడ్డి అన్నారు. రాఘవ గొప్ప సంఘ సంస్కర్త అని, నాటకాలలో స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలనే ఉద్యమానికి ప్రవర్తకుడు ఆయనేనని, ఆయన నటించిన రైతుబిడ్డ, ద్రౌపదీ మాన సంరక్షణం అనే చలన చిత్రాల ప్రింట్లు సంపాదించి వాటి నకళ్ళను సిద్ధపరచాలని మంత్రి నాటక అకాడెమీని కోరారు. టెలీ కమ్యూనికేషన్స్ జనరల్ మేనేజర్ శ్రీ త్రిపురనేని హనుమాన్ చౌదరి తమ ప్రసంగంలో రాష్ట్రంలోని ప్రతి పెద్ద పట్టణంలోను బళ్లారి రాఘవ పేర రంగస్థలం వుండాలని సూచించారు. రాష్ట్ర ప్రభుత్వ ఆస్థాన నటుడు శ్రీ పీసపాటి నరసింహమూర్తి ప్రసంగిస్తూ, రాఘవ నటించిన చండిక అనే మరొక చలన చిత్రం ప్రింటును కూడ సంపాదించి దాని నకలును సిద్ధపరచాలని సూచించారు. బళ్లారి రాఘవకు ఈ విధంగా జరిగిన సన్మానానికి నటలోకం గర్వించాలని నాటక అకాడెమీ అధ్యక్షురాలు శ్రీమతి జమున అన్నారు. పోస్ట్ మాస్టర్ జనరల్ శ్రీపాల్ రాజన్ ప్రసంగిస్తూ ఇంతవరకు తంతి తపాలా శాఖ వేమన, వీరేశలింగం, సర్వేపల్లి రాధాకృష్ణన్, వి.వి. గిరి మున్నగు ఆంధ్ర ప్రముఖుల పేర ఏడింటి తపాలా బిళ్లలు విడుదల చేసిందని తెలిపారు.

నాటక అకాడెమీ సలహాదారు శ్రీ వి. ఆర్. కృష్ణ రాఘవ నటన వైభవాన్ని వివరించారు. రాఘవ తన నిరంతర దీక్షతో రంగస్థలానికి గౌరవం సంపాదించారని శ్రీ ఆరుద్ర అన్నారు. శ్రీమతి వింజమూరి సీత 1944 నాటి ఒక ఉదంతాన్ని ప్రస్తావించారు. కళాశాల వారు ప్రదర్శించిన ఒథెల్లో ఆంగ్ల నాటకంలో రాఘవతో పాటు తాను నటించానని, ఆయన మహా నటుడే కాక గొప్ప సంఘ సేవకుడని శ్రీమతి సీత అన్నారు. నాటక అకాడెమీ కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజు ప్రారంభంలో స్వాగతం చెప్పారు. నాటక అకాడెమీ కోశాధికారి శ్రీ సి. ఎస్. శరవణం ధన్యవాదాలతో సమావేశం సమాప్తమైంది. ఈ స్మారకతపాలా బిళ్ల ఆవిష్కరణోత్సవాన్ని రాష్ట్ర నాటక అకాడెమీ నిర్వహించింది. ఈ ఉత్సవానికి బళ్లారి రాఘవ దౌహిత్రులు, తక్కిన బంధువులు, బళ్లారి నుంచి పలువురు ప్రముఖులు హాజరయ్యారు.

బళ్లారిలో రాఘవ స్మారక తపాలా బిళ్ల ఆవిష్కరణ హెడ్ పోస్టాఫీసులో జరిగింది. రాఘవ అల్లుడు, ఆంధ్ర నాటక పితామహుని చివరి కుమారుడు శ్రీ ధర్మవరం వేణుగోపాలాచార్యులు ఆవిష్కరించారని తెలియవచ్చింది.

### ఆలూరి బైరాగి ఆగమగీతి :

మానవతావాదానికి జీవితాన్ని మీదుకట్టి మానవతకు మరణం లేదని ఉద్ఘోషిస్తూ కవితా గానం చేసిన మిత్రుడు శ్రీ ఆలూరి బైరాగి మూడవ కవితా సంపుటి ఆగమగీతి ఆవిష్కరణ నవంబర్ నెల 3 వ తేదీన ఆంధ్ర సారస్వతపరిషత్తు ఆవరణలో జరిగింది. ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి. ఎ. చౌదరి, కవితాసంపుటిని ఆవిష్కరించిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, ప్రారంభోపన్యాసకులైన ఆస్థాన కవి దాశరథి కృష్ణమాచార్యులు, వక్తలు శ్రీయుతులు కాళోజీ నారాయణరావు, కుందుర్తి ఆంజనేయులు, బూదరాజు రాధాకృష్ణ, గజ్జల మల్లారెడ్డి, తిరుమల రామచంద్ర, రాభట్ల రాధాకృష్ణమూర్తి, ఏటుకూరి ప్రసాద్, నగ్నముని బైరాగి మానవతావాద గంభీర కవితను, వ్యంగ్య కవితను గురించి అతని ఆత్మాభిమానాన్ని తలవంచని తనాన్ని గురించి, ఆశావాదాన్ని గురించి ప్రశంసిస్తూ ఆయన ఆత్మగౌరవం మానవతావాదం, రచనాశిల్పం ముందు తరాల వారికి ఒరవడి కావాలన్నారు. ఈ కవితా సంపుటిని ఎ. బి పి ప్రచురణల నిర్వాహకులు— స్వర్గీయ బైరాగి సోదరులు శ్రీ సత్యం ముద్రించి ప్రచురించారు. ఆయన బైరాగి తక్కిన తెలుగు రచనలను, హిందీ రచనలను కూడా ప్రచురించ నున్నట్లు తెలిపారు. సారస్వత పరిషత్తు హాలు సహృదయులతో కిటకిటలాడింది.

### తారాశశాంక నాటక ప్రదర్శనం :

శ్రీ మారుతి రామానంద నాట్య కళాసమితి నవంబర్ ఒకటవ తేదీన ఇందిరా ప్రియదర్శిని హాలులో ప్రదర్శించిన తారాశశాంక నాటకం ప్రేక్షకులను చక్కగా అలరించింది. నాటకం జరిగిన రెండున్నర గంటల సేపు ప్రేక్షకులు మైమరచి పోయారు. నాటకంలోని ప్రతి పాత్రా తనను చక్కగా పోషించుకొన్నారనే చెప్పాలి. తారాచంద్ర నారద పాత్రధారులు బాగా పాడారు. అత్రి అనసూయ పాత్రధారుల ప్రవేశ నిర్వహణలు బాగున్నాయి. నిర్వహణ సంధిలో బృహస్పతి పాత్రధారి నటన ప్రేక్షకులందరినీ విశేషంగా ఆకర్షించింది. ఈ నాటకం స్వర్గీయ వి. సూరిబాబు బృందం తారాశశాంక నాటకాన్ని స్మరింపజేసింది. శ్రీ శివలెంక రాజేశ్వరరావుబృందం సంగీతాన్ని సముచితంగా నిర్వహించింది తారా చంద్ర బృహస్పతి నారదుల పద్యాలు బాగా ఆలపించారు. శ్రీ పి. నీలకంఠ శాస్త్రి బృహస్పతి పాత్ర ధరించడమే కాక నాటకానికి దర్శకత్వం వహించారు.

### చిన్నారుల విన్యాసాలు :

ఏటా, జవహర్‌లాల్ నెహ్రూ జన్మ దినోత్సవ సందర్భంగా జరిగే బాలల దినోత్సవాలు ఈసారి ఆంధ్రప్రదేశ్ రజతోత్సవం పురస్కరించుకొని లాల్‌బహదూర్ స్టేడియంలో పెద్ద ఎత్తున జరిగాయి. వేలాది బాలబాలికలు విన్యాసాలు, పెరేడు చేశారు. స్టేడియం బాలలతో కిటకిటలాడిపోయింది. విజయనగర కాలనీ సెయింట్ ఆన్స్ విద్యార్థుల 'చంద్రుడు చుక్కలు' ప్రదర్శనం, రోజరీ కాన్వెంట్ వారి 'సాసర్ చెమ్‌చాలా' ప్రదర్శన, సంత్‌నగర్ సెయింట్ థెరిసా వారి 'చాచా నెహ్రూ' 'లాంగ్ లివ్ చాచా నెహ్రూ' విన్యాసాలు, గుజరాతీ హైస్కూలు బాలికల గర్బ నృత్యం, రాజభవన్ విద్యాలయం వారి జానపద నృత్యాలు. అంబర్‌పేట



# ఆంధ్రలో అపూర్వ సంఘటన!

విజయవాడకు 35 కి. మీ. దూరంలో కొండపల్లి అటవీ ప్రాంతంలోని రామన్నపాలెం (వెల్లదేవతపాడు గ్రామం) లోని ఒక పొలంలోని నీళ్ళులేని బావిలో ఒక చిరుతపులి పడిపోయింది. వారం రోజులపాటు ఆ పులి బావిలోనే వుండి పోయింది. చుట్టుపక్కల నుంచి వేలాది ప్రజానీకం ఆ గ్రామానికి వెళ్ళి ఈ వినోదాన్ని చూసి వచ్చారు.

నవంబరు 13 రాత్రి ఈ చిరుత ఆ బావిలో పడి వుంటుందని భావించారు. 14 సాయంత్రం ఓ కట్టెలు కొట్టుకొనే వ్యక్తి దీనిని చూడటం తటస్థించి, వార్త ను గ్రామంలోకి చేరవేసాడు.

పోలీసులు, అటవీ శాఖకు చెందినవారు ఈ బావి వద్ద గస్తీ కాసారు.

చివరకు నవంబరు 19న హైదరాబాద్ జంతు ప్రదర్శనశాల, మొసళ్ళ పెంపకం కేంద్రాలకు చెందిన నిపుణులు, అటవీశాఖ అధికార్లు ఆ చిరుతపులికి తుపాకులు పేల్చడంద్వారా మత్తుమందు ఇంజక్షన్లు చేసి స్పృహ పోగొట్టి ఓ బోనులో బంధించారు. 20న ఆ చిరుతను తీసుకొనిపోయి, కొండపల్లి అడవుల్లోని లోతట్టు ప్రాంతంలో వదిలేసి దానికి స్వేచ్ఛ కల్పించారు.

"ఒక చిరుతపులి ఈ విధంగా అనుకోకుండా బావిలో పడి తర్వాత స్వేచ్ఛ పొందడం అనేది ఆంధ్ర ప్రదేశ్‌లో యిదే మొదటిసారిగా జరిగిన సంఘటన!" అని అటవీశాఖ ఉన్నతాధికారి ఒకరు అన్నారు.

— పి. ఎస్

పోలీసు పాటశాల వారి కవాతు ప్రేక్షకుల మెప్పు పొందాయి. ముఖ్య అతిథిగా వచ్చిన ముఖ్యమంత్రి, అధ్యక్షత వహించిన విద్యామంత్రి ప్రసంగాలేమీ చేయలేదు. ప్రారంభంలో ఉన్నత విద్యాశాఖ డైరెక్టరు శ్రీ ఆదినారాయణ స్వాగతం చెప్పారు.

**ఖాలిస్తాన్ పదిడాలర్ల నోటు :**

భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు శ్రీ అటల్ బిహారీ వాజపేయి నవంబర్ 16వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ఖాలిస్తాన్ బ్యాంకు విడుదల చేసిన పది డాలర్ల నోట్లను చూపించారు. ఎరుపు, గోధుమ రంగుగల ఈ నోట్లు కెనడాలో ముద్రితమయ్యాయి. ఈ నోట్లపై ఖాలిస్తాన్ బ్యాంకు గవర్నర్ హోదాలో సుర్జన్‌సింగ్ సంతకం గురుముఖీ లిపిలోను, ఇంగ్లీషులోను ఉంది. నోట్ల అడుగున రిపబ్లిక్ ఆఫ్ ఖాలిస్తాన్ అని, గురుముఖీ లిపిలోను, ఇంగ్లీషులోను ఉన్నది. నోటు వెనుకన బాబ బందా సింగ్ బహదూర్ [18 వ శతాబ్దం] చిత్రం ఉంది. శ్రీ సుర్జన్‌సింగ్ తనకీ నోట్లు పంపారని, దానితోపాటుపంపిన లేఖలో శిఖ్ఖుల పై హిందువులు అత్యాచారాలు చేస్తున్నట్టు ఆరోపించారని శ్రీ వాజపేయీ అన్నారు. ఖాలిస్తాన్ ఉద్యమాన్ని భారతీయ జనతా పార్టీ సహించదని, ఇది జాతి వ్యతిరేకోద్యమమని ఆయన అన్నారు.

**బి. జె. పి ఊరేగింపుపై లాఠీచార్జి :**

ధరల పెరుగుదలకు వ్యతిరేకంగా నవంబర్ 16న భారతీయ జనతా పార్టీ విధాన సభముందు జరిపిన ప్రదర్శనను చెదరగొట్టడానికి పోలీసులు లాఠీచార్జి చేశారు. దాదాపు ఐదారువేల మంది ఉన్న ఈ ఊరేగింపునకు శ్రీయుతులు నరేంద్ర, దత్తాత్రేయ, శ్రీమతి కుముదినీ నాయక్ మొదలైనవారు నాయకత్వం వహించారు.

**ఉపశ్రుతి :**

పద్మశ్రీ భీమన్న కవిగారికి ఆశ్వమేధంలో బాగా వేడి తగిలినట్టుందే?— అన్నారొకరు, విధాన పరిషత్తులో గుర్రప్పందాలపై ఆయన ప్రసంగం చదివిన తర్వాత. అన్యాయం జరిగితే ఉన్నది ఖండించడం కవి కర్తవ్యం. కనుక శ్రీ భీమన్నగారు తన కర్తవ్యం ఎలా మరుస్తారు? అని ప్రశ్నించారు మరొకరు.

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఆర్. ఆర్. ఎస్. – హైదరాబాదు**

నాకు వివాహమై ఐదు సంవత్సరములైనది. ఇంతవరకూ సంతానం కలుగలేదు. సెమెన్ టెస్టు చేయించుకున్నాను. ఏజా స్పెర్మియా అని తెలిసింది. స్పెరమ్స్ లేకపోతే సంతానం కలగదా? ఏమైనా మందులు వాడితే ఫలితముంటుందా ?

స్పెరమ్స్ లేక పోవడం వల్ల సంతానం కలిగే అవకాశంలేదు.

మందులు వాడిచూడండి. టెస్టిస్‌లలో స్పెరం లను ఉత్పత్తిచేసే గ్రంధులు పెరగటంవల్ల మాత్రమే మీకు సంతానం కలిగే అవకాశం ఉంటుంది.

**బి. ఎస్ ఎన్. ఆర్. – గౌహతి**

మా అమ్మాయి వయస్సు 15సంవత్సరములు. అమ్మాయికి ప్రతి 20 రోజుల కొకమారు బహిష్టు జరుగుతున్నది. అదిగూడా పూర్తిగా కాదు. నలుపుగా ఉన్నట్లు తెలుసుకొంటిమి. ఆ రోజు నుండి అమ్మాయి నీరసముగా అయిపోవటము, అదేరోజు లలో ఫిట్స్‌లాగున రావటం జరుగుతోంది. మొదటి మారు ఫిట్సు వచ్చినప్పుడు గూడా దూరంగానే ఉన్నదట. దీనికి మీ సలహా ఏమిటి ?

బహిష్టు రావటం మొదలయిన కొన్ని నెలల పాటు [కొందరికి కొన్ని సంవత్సరాలపాటు] ఇలా అవకతవకలుగా బహిష్టు రావటం సహజం.

ఆ వయస్సులో ఉండే అత్యుత ఆందోళనల దృష్ట్యా, కొందరు మామూలు వారికన్నా ఎక్కువగా ఈ విషయాన్ని "పట్టించుకోవటం" వల్ల ఇలా ఫిట్సు మొదలయినవి ఏర్పడతాయి. ఇలాటి వారికి వారి తలిదండ్రుల ఆందోళన ఇంకా ఎక్కువ దోహదకారి అవుతుంది. దీనిని నచ్చచెప్పటం మినహా ప్రత్యేక మందులు వయస్సు దృష్ట్యా అనవసరం.

**పి. వి ఎస్. కె – శ్రీశైలం**

ఇరవది సంవత్సరములుగా రోజుకు 20 సిగరెట్లు త్రాగుటవలన ఏమైనా ప్రమాదంఉన్నదా?

ప్రమాదం అనే దాని అర్థాన్నిబట్టి ఉంటుంది. కేన్సర్ ఏర్పడటం మాత్రమే 'ప్రమాదం' అని మీరనుకొంటే అటువంటి ప్రమాదం ఏర్పడనూ వచ్చును, లేకనూ పోవచ్చును.

కాని సిగరెట్లు ఎక్కువ తాగటంవల్ల వూపిరితిత్తుల సహజ పనితనం తగ్గుతుంది. గాలిగొట్టాల [బ్రాంకై]లో వాపు మొదలయినవి ఏర్పడే అవకాశం ఉన్నది.

**వి. ఎస్. – పత్తికొండ**

నా వయస్సు 21 సంవత్సరములు. నాకు టెస్టికల్స్ పైన ప్రక్కన చర్మంమీద పొక్కులు పొక్కులుగా ఏర్పడుచున్నవి. ఈవిధంగా సంవత్సరమునుండి ఉన్నది. ఇవి ఏ మాత్రము బాధగాని, దురదగాని, కల్గించుటములేదు.

చెమట ఎకువగా పట్టే ప్రాంతాలలో, చెమటను ఉత్పత్తి చేసే గ్రంధుల నాళాలు అడ్డుపడటం జరిగే అవకాశం ఉన్నది. ఇలా ఏర్పడే పొక్కులని సెబేషియస్ సిస్ట్ అని అంటారు. బాగా పెద్దగా ఉండి చీము పడితేనే తప్పనొప్పి ఉండదు. చాలా చిన్న శస్త్ర చికిత్స ద్వారా ఇలా పెద్దవయిన పొక్కులను తీసివేయవచ్చును.

**ఎమ్ ఎస్ బి – గుంటూరు**

నా వయస్సు 16 సంవత్సరములు. నేను ఎదగటం లేదని నా మిత్రులు హేళన చేస్తున్నారు. నా ఎత్తు 56 సెం. మీ.

మీకు ఎదిగే వయస్సు పూర్తి కాలేదు. కొందరికి పెరుగుదల ఆలస్యంగా మొదలవుతుంది. మీ వయస్సుకి 33 నుంచి70 అం. దాకా ఎత్తు ఉండవచ్చును. కొందరు వారి తలిదండ్రులుపొట్టిగా ఉండటంవల్ల వీరుకూడా పొట్టిగానే ఉండటం జరుగుతుంది. కొందరికి కారణం ఏమీ లేకుండానే పొట్టిగా ఉండటం జరుగుతుంది.

మిత్రుల హేళనని లెక్క చెయ్యకండి. ఎత్తు పెరగటానికి ప్రత్యేక మందులు ఏవీలేవు.

# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## కథలు

20—11—81 నాటి ఆంధ్రసచిత్ర వార పత్రికలో వెలువడిన వి. వి. బి. రామారావు గారి ''పిలుపు'' కథ నేటి డాక్టర్లకు ఒక సందేశం లాంటిది. వాళ్ళిండి..వద్దిల్లండి కథచాలా బాగుండి ఆలోచన రేకెత్తిస్తుంది.

పి. పాండు రంగారెడ్డి (చిత్తూరు)

* * *

20—11—81 వార పత్రిక ముఖ చిత్రం 'చిన్నారి నవ్వులు, ఇంటికి జ్యోతులు' అనే భావాన్ని వ్యక్త పరుస్తున్నట్లుంది. యురేకా కథ చాలా బాగుంది.

ఆలీమహమ్మద్ (యానాం)

* * *

చిరు నవ్వులు చిందించే చిన్నారి పాపల ముఖ చిత్రంతో వెలువడిన పత్రికలో (20—11—81) ప్రచురించిన యురేకా వంటి కథలు ఈతరం యువతరం వారికి ఎంతో ఉపకరిస్తాయి. ''మనిషి మనిషికీ మధ్య'' కథ బాగుంది.కథాంతము చాలా బాగుంది.ఇటువంటి కథలు ప్రచురించి మంచి కథలను వ్రాయుట ప్రోత్సాహించు పత్రికకు నా హృదయపూర్వక అభివందనములు.

సరస్వతీనాథ్ (అనంతపురం)

* * *

20—11—81 వ తేదీ చిన్నారి చిరునవ్వులు సిరు లిచ్చే చిరుదివ్వెలు ముఖ చిత్రంలో వెలువడిన పత్రికలో పిలుపుకథ చాలా బాగుంది. రచయిత వి. వి. బి. రామారావు గార్కి మా ధన్యవాదాలు.

దేవ ఉషాదేవి, కె.సుధ, కె.ఉదయలక్ష్మి (భోగాపురం)

## సీరియల్

20—11—81 తేది వార పత్రికలో ముఖచిత్రం ముద్దుముద్దుగా పసిమొగ్గలను ఆకర్షించింది. ''జీవిత వనంలో కొత్తగాలి'' ''కోరిక తీరేవేళ'' సీరియల్ కథలు ఉత్సాహంగా మరిమరి చదవాలనిపిస్తున్నాయి.

చింతా రంగనాయకులు (ధర్మవరం)

* * *

20—11—81 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రం ఎంతో ఎంతెంతో ఆకర్షణీయంగావుంది. ఇక పోతే సీరియల్స్ రెండు కూడా చింతో ఇంటరెస్టుగా ముందు ముందు ఏమౌతుందో అని వుంది. ఇందిరా, సుశీలాదేవిగార్లకు మా ధన్యవాదములు.

శైలజ, చంద్రనాథ్ (విశాఖపట్నం)

* * *

13—11—81నాటి శ్రీమతి జయసుధ ముఖ చిత్రం ఆకర్షణీయంగా ఉన్నది. ''కోరిక తీరేవేళ'' సీరియల్ చాల ఆసక్తికరంగా కొనసాగిస్తున్నరచయిత్రి గారికి మా హృదయ పూర్వక అభినందనలు.

రంగినేని మహేంద్రనాథ్, నందిగామ సురేష్
[కొల్లాపూర్]



రాష్ట్ర రజతోత్సవాల సందర్భంగా చిల. లూరిపేటలో కళాసదస్సు ఆధ్వర్యంలో జరిగిన నృత్య కార్యక్రమాలలో నాగ నృత్యాన్ని ప్రదర్శించిన కుమారి ప్రగడ శాంతిలక్ష్మిని చిత్రంలో చూడవచ్చు.

## కార్టూన్స్

13—11—81 జయసుధ ముఖ చిత్రంతో వెలువడిన సంచిక చాలా ఆకర్షణీయంగా ఉంది. లోకం పోకడలో పూమోన్‌గారి కార్టూన్లు నవ్విస్తూ చాలా బాగుంటున్నాయి. ఈ వారం కార్టూన్లు కడుపుబ్బేటట్లు నవ్వించాయి.

బి. ఎస్. వి. రాజు (రాజమండ్రి)

## గమనిక

11—12—81 సంచిక ముఖచిత్రం నటి పేర్న ఫోటో తీసిన వారిపేరు శ్రీ కె.వి.యస్. మూర్తి అని గమనించ కోరుతున్నాము.

—సం.

Printed and Published by S. NageswaraRao at
the Andhra Patrika press, MallikarjunaRao Street,
Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna